# "తీరనికోరిక-తరువాత"

రావు వేంకట మహీపతి గంగాధర రామారావు

పిఠాపురము యువరాజు

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కొ

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# "తీరనికోరిక — తరువాత"

రావు వేంకట మహీపతి గంగాధర రామారావు
పి ఠా పు ర ం యు వ రా జు




పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

కాలచక్రములో

నలిగి పోయెడి

బ్రతుకులకు.

## నాంది



భగభగమండిపోవుచున్నది కాలము. నలిగిపోవు చున్నది జీవనము. పొంగిపోవుచున్నది భావము — వర్తమానము — వర్తమానము — ముందేమో! వెనుకేమో! —

కంటినీటిలో మందహాసముతో సాగి పోవుచున్నది విశ్వరంగమునందు విశ్వనాటకము.

చీకటిలో గ్రుద్దులాటా? దేవుళ్ల దెబ్బలాటా?

శాంతము, పావము; సర్వే లోకాస్సుఖినోభవంతు.

# పాత్రలు

తిలోత్తమ.

వాసంతి.

సుమంగళి.

అచ్చమ్మ.

ఇద్దరు, ముగ్గురు స్త్రీలు (సభలో)

నరేంద్రుడు.

వాగనుశాసనుడు.

ఘటోత్కచుడు.

పిచ్చివాడు.

సభికులు, పల్లెటూరి వ్యక్తి, పోలీసు ఇనస్పెక్టరు, పోలీసులు, సేవకుడు, వైద్యుడు, గొర్రెలకాపరి మఱియొక లోకమునందలి పాత్రలు.

# "తీరని కోరిక - తరువాత"

## ప్రథమాంకము

....○○....

### ఒకనాడు

ప్రదేశము (ఒక మైదానము)

ప్రవేశము (ఒక చిన్న బహిరంగ సభకు అనుకూలమగు జనులు. ఇద్దరు ముగ్గురు స్త్రీలుకూడ పురుషులమధ్య కూర్చుందురు - వక్తకొఱకు, ఒక చిన్న బల్ల వేయబడియుండును.)

వాగనుశాసనుడు ప్రవేశించి, బల్లను అధిరోహింపబోయి బల్లపడిపోవ తానుకూడ నేలపైబడును.

(సభలో హర్షధ్వనులు — నవ్వులు)

వాగనుశాసనుడు

(లేచుచు, దులుపుకొనుచు) నవ్వండి, నవ్వండి — మీ నవ్వులకి అర్థాలులేవు, మీ ఏడుపులికి అర్థాల్లేవు —

ఒక సభికుడు

నోరుమూయ్ ! (హర్షధ్వనులు సభలో)

వాగనుశాసనుడు

నీ నోరా ! (సభలో హర్షధ్వనులు)

మొదటి సభికుడు

(లేచి సమీపించి) ఏం పేల్తున్నావ్.

(చొక్కా చేతులు మడతపెట్టును. హర్షధ్వనులు.)

వాగనుశాసనుడు

(వెనుకకు జరుగుతు) ఏం నాకు భయ మనుకొన్నావా —(మళ్లి) (సభలో హర్ష ధ్వనులు) (ఇంకొక్కంత వెనుకకు వెడలి) కాని అనవసరం ఐన గొడవ ఎందుకని శాంతిస్తున్నాను — ఓ మహాశయులారా! మహాత్ముని అహింసా విధానాన్ని మనస్ఫూర్తిగా అమల్లో పెట్టేవాణ్ణి నేనే — ఈతా ...

సభలో

("ఓమహాత్మ" అని కొందఱినుండియు,
"ఓమతిలేని పిరికిపందా" అని కొందఱినుండియు కేకలు)

వాగనుశాసనుడు

నేను పిరికిపందనా, చెప్తూతా (బల్ల సరిచేసి ఎక్కబోవును.)

సభలో కేకలు

అయ్యా! మళ్లాపడతారు జాగ్రత్త! (హర్షధ్వనులు)

వాగనుశాసనుడు

(ఎక్కి) పడితే పడతాను—అది నా యిష్టం—నా స్వేచ్ఛ — నాజన్మ హక్కు — స్వేచ్ఛలేనిదే నరకం — ఆజ్ఞాపించేవాడే ఉండకూడదు — అదిఉంటే దాస్యం — దుఃఖం — ఈ స్వేచ్ఛ కొఱకు నా జీవితాన్నైనా ఇచ్చేస్తా!

సభలో

పీడ వదుల్తుంది! (కరతాళధ్వని)

వాగనుశాసనుడు

నేను చచ్చినా నా ఆత్మ ఈ స్వేచ్ఛకొఱకు, మీ స్వేచ్ఛ కొఱకు ఇక్కడే నిలబడి స్వేచ్ఛావిధానాన్ని ఏకధాటిగా ప్రపంచానికి చాటించగలదు —

మొదటి సభికుడు

(సమీపించును)

వాగనుశాసనుడు

(చివాలున బల్లనుండి వెనుకకు దుమికి)అయ్యా! చొక్కా చేతులు దింపేయండి — అలాంటి విషయాలు అనవసరం ఇక్కడ — ఇది సభ! యుద్ధంకాదు, — ఇక్కడంతా మాటలతో జరగవలసిందే అన్ని విషయాలును — కార్యాలతో ఈసభకు సంబంధంలేదు — శాంతం భూషణం.

(బల్లఎక్కును, సభికునితో కరస్పర్శచేయును)

సభలో

"సెహబాస్" — సిగ్గు, సిగ్గు.

వాగనుశాసనుడు

సిగ్గెందుకు — సిగ్గనేది నానిఘంటులో లేదు — (కరతాళములు) సిగ్గనేది ప్రపంచంలోనే లేదు — సిగ్గనేది ఆడవాళ్ళకే —

ఒక స్త్రీ

(లేచి) ఆడవాళ్ళకు సిగ్గెందుకు? — ఈవిధంగా స్త్రీలను అవమానిస్తున్నంతకాలం దేశానికి విముక్తిలేదు — ఈమాటలకి స్త్రీలోకంఅంతా మడిపోయి ఉద్రేకంచేత ఉడికిపోయి కంపిస్తది— (చేతిని కదలించును.)

సభలో

(కరతాళములు)

ఒక పల్లెటూరివ్యక్తి

సన్నిపాతజ్వరానికి మా మామ్మదగ్గర మహా మంచిమందు ఉందండి అమ్మగారు!

సభలో

(హర్ష ధ్వనులు, నవ్వులు)

వాగనుశాసనుడు

(బల్లదిగి) శాంతించండి — ఒకమాట చెపుతా — మీాకర్థం అవ్వలేదు — (మొదటిసభికుని చూచి) అయ్యా! తమరు కొంచెం దయచేయండి. రాజీ అయిపోయిందికాదు మనకి — నేను చాలా కంగారులో ఉన్నాను—("పాపము" "పాపము" అనికేకలు)

మొదటి సభికుడు

(కూర్చుండును)

వాగనుశాసనుడు

నేను బల్లదిగటం భయపడికాదు — ఈస్త్రీగారి కర కమలం నాకు తగిలితే వారికి నొప్పి పెడుతుందేమో అని కొంచెం జరిగేను. ఓ స్త్రీరత్నముగారూ! ప్రపంచశాంతికొఅకు మీాకు నమస్కారం — నే అన్నదేవిటంటే స్త్రీలకే సిగ్గనేది లేదు. ఇప్పుడని —

ఆ స్త్రీ

స్త్రీలంత నీచమనా! —

వాగనుశాసనుడు

అబ్బెబ్బే! ఎంతమాత్రం కాదు. శాంతం పాపం, శాంతం పాపం. స్త్రీలంత గొప్పవారే సిగ్గు విడచిపెట్టినప్పుడు ఇక అది ఎందుకని అనబోతున్నా!

సభలో

(హర్ష ధ్వనులు)

స్త్రీ

(కూర్చుండును. చెమట తుడుచుకొని పైట సర్దుకొనును.)

పల్లెటూరి వ్యక్తి

(ఆమెను తేరి పారచూచును.) (పక్కనున్నవానితో గట్టిగా)

ఆడోళ్లు మొగోళ్లుకలిసి చేసుకొనే ఈ మీటంగాలు మా బాగున్నాయి — ఇన్నాళ్లనుండి ఏంటిరా సెప్మా ఈళ్లందఱికి మతులుపోయేయా పనులుమానుకొని గాడిదెల్లాగ కుక్కల్లాగ అరుస్తుంటారు, ఈ మీటంగాలు చేసుకుంటారు అని ఆశ్చర్యం పడేవోణ్ణి — బాబూ మాబాగా తెలిసింది! ఏఁవండి ఆరితో మాట్లాడొచ్చా!— అమ్మగారూ దండం అండి — లేసి ఏమన్నా మాట్లాడండి !—

ప్రక్కనున్నవారు

తప్పు అలా గట్టిగా మాట్లాడకూడదు.

పల్లెటూరి వ్యక్తి

ఏం బాబు మాట్లాడొద్దంటావ్ !—

ప్రక్కనున్న వారు

స్త్రీల విషయము అలా మాట్లాడకూడదు—వాళ్ళని అలా కళ్లువిప్పి చూడకూడదు.

పల్లెటూరి వ్యక్తి

(గట్టిగా) ఏంబాబూ, నువ్వేమట్టుకు తెగేసి అదేపనిగా సూట్టంలేదు ఈ అమ్మల్ని ? (సభలో చప్పట్లు.)

స్త్రీ

వాగనుశాసనుడుగారూ, సామ్యవాదుల సభలో మీరు ఉపన్యసిస్తారని ఇక్కడకు వచ్చేం! అంతేకాని అనవసరం ఐన విషయాలతో కాలక్షేపం చేస్తూంటే ఎట్లా! మాకుపనులు లేవు? — ఇదంతా సంతగోలలోకి మారింది — ఈ పల్లెటూరి మనిషి ఎవరో అసలే మర్యాద పాటించటంలేదు.

వాగనుశాసనుడు

(విషయములు వ్రాసుకొనుచు బల్లనెక్కి) సోదరీ శిరోమణీ!

పల్లెటూరి వ్యక్తి

(లేచి) ఏఁవండి అమ్మగారూ! అలా అంటారు. నేను ఏం మర్యాదకానిపని చేసేనండి? — నేను కాపోణ్ణండి! — మర్యాదకానిపనిచేస్తే కులం తప్పేస్తారండి — మాకు మర్యాద చాలా ఎక్కువండి — మాఆడోళ్ళని ఇలాంటి మీటంగాల లోనికి రానివ్వమండి — మాటాడితే పల్లెటూరోళ్ళని ఆక్షేపిస్తారు — ఏం, మేం ఏంతక్కువండి — పనంతా మేం చేస్తాఁవండి — కాయకష్టాలకోర్చి పొలందున్ని నాలుగుగింజలు సంపాదిస్తాఁ

వండి! ఏదోమాయచేసి పన్నులనో తన్నులనో సంపాదించిన నాలుగుడబ్బులు ఈ పనిలేనోళ్ళు హాయిగా పంకాలుకింద పట్నాలలో కూర్చుని లాగేస్తారండి — ఇల్లాంటోళ్ళందరు ఈ పట్నాల్లో వాళ్ళు, ఆళ్ళి టోపీవసే మైరావణ ముండాకొడుకులెవళ్ళో! ఇలా ఆళ్ళేచేయాలికాని పల్లెటూరోళ్ళం చెయ్యేంవండి — వోట్లుకోసం మట్టుకు కుక్కలు తిరిగినట్లు ఈ అయ్యోరు తిరుగుతారు మాచుట్టు — కాని మంత్రాలో— తంత్రాలోఅయితే మళ్ళీమా మొకంఅన్నా చూడరండి-పై పెచ్చు అడ్డమైనపన్నులు వేసి మమ్మల్ని నలివేస్తారండి — మొన్న ఏంవైందినాకు — పట్నంచూడొచ్చు, మంత్రులతో మాట్లాడితే (మావారలే లెండి) ఒకడు పన్నులు తీసేస్తారు అని తీసు...

వాగనుశాసనుడు

అయ్యా, ఆగండి — నువ్వు —

పల్లెటూరి వ్యక్తి

ఆ నువ్వు — ఏంవిటి — మర్యాదగా మాటలురానీ —

వాగనుశాసనుడు

(కొంచెము వెనుకకుతగ్గి) క్షమించండి — చనువుమీద అన్నా —

పల్లెటూరి వ్యక్తి

చనువేటండీ! మీకూ నాకూ నేస్తం ఏంవిటీ — మీ రెవరో నాకు తెలియదు, నేనెవణ్ణో మీకు తెలియదు. నీలబ్బ ఎవడో, నా అబ్బఎవడో!

వాగనుశాసనుడు

అయ్యా! తమరు చాలా గొప్పవారు — తమమాటల్లో చాలా అర్థంఉంది. నేను చాలాసార్లు ఆలోచించేను ఇదేవిషయం ఎవడి అబ్బ ఎవడోఅని —

పల్లెటూరి వ్యక్తి

"డీ. డీ" ఏఁవిటండీ — మర్యాదగా మాట్లాడండి.

(సమీపింప బోవును.)

వాగనుశాసనుడు

అయ్యా! శ్రమతీసుకోకండి! — అవసరంవస్తే కాళ్లైనా పట్టుకోడానికి అభ్యంతరంలేదు. — (సభలోనవ్వులు)

పల్లెటూరి వ్యక్తి

ఆఁ! మామంచిమాట పుట్టించేరండీ — ఏ గాడిద కూతన్నా కూయొచ్చు, ఏ ఎదవపనైనా చేయొచ్చు చమించాలి అంటే చాలు - మొన్న ఒక గమ్మత్తైందండి మా వూళ్ళో — ఎవడో ఒకడు కవిగాడో అంటే పదాలు కటతోరు అల్లు, లేకపోతే వాలంటీరో, ఏఁవైంతేనేం! ఒకదొంగ ముండాకొడుకు వచ్చి మాకరణంఇంట్లో బసచేసేడు మూడునెల్లు —



(లేచి) సభజరగటంలేదు—ఈయననిమాట్లాడ నియ్యకూడదు.

పల్లెటూరి వ్యక్తి

ఎవడాన్ నన్ను మాట్లాడ నీయనోడు — అందులో ఈ అమ్మోరు మరీ ఘాటీగా మాట్లాడుతున్నారే — దీని తల్లీ

సిగ్గ తరగ! — (సభలో ఈలలు) (దీనితల్లి బోడిముండ సిగ్గలేదు అని కేక) (చప్పట్లు)

వాగనుశాసనుడు

(ఆయనను సమీపించి) (మెల్లగా) ఈ ఆడముండలతో వచ్చేగోలే ఇది — వాళ్ళకి తోచదు. ఒకళ్ళు చెప్పితే నచ్చదు — నేను చెవుతాకాదూ—తమరు కొంచెం శాంతించండి. (స్త్రీని సమీపించి) ఈ పల్లెటూరి వెధవలతో ఉన్నా చిక్కే—ఇది. వీళ్లతో మిక్సు అవ్వడం చాలా డామ్ ఆక్వర్డు — మీరుకొంచెం ఓపిక పట్టండి— నేను చెప్తాకాదూ — (బిగ్గరగా) అయ్యా తమరుచెప్పేది చెప్పించండి —

పల్లెటూరి వ్యక్తి

ఏఁవుందేటి సెప్పేది — ఆ ఆసామి కరణంగారియింట్లో ఉన్నట్టేడుండి కరణంగారి వెధవచెల్లెల్ని ఒకరాత్రికాడ ఉంకో ఊరికి తీసుకుపోయేడు. మన్నాడు పట్టుకొని నాలుగు తన్నులు తన్నితే — తప్పొచ్చిఁది. చమించండి అని నలుగురు కాళ్ళు పట్టుకొన్నాడు — ఏం లాభం, జరగవలసింది జరిగిపోయింది!

స్త్రీ

ఇది చాలా అసభ్యం!

వాగనుశాసనుడు

క్షమించాలి — (సభలో చప్పట్లు) (బల్లనెక్కి—) సోదర సోదరీ మణులారా! ఆలస్యం ఐంది — ఇక సభ జరిపించాలి — (సభలో వెధవసభ వెధవ అగ్రాసనాధిపతి అనికేకలు, నవ్వులు)

వాగనుశాసనుడు

నిజమే, మీరు చాలా బుద్ధిమంతులు — బాగా శల విచ్చేరు వెధవలతో, చేతకాని బోడిముండలతో, నిండిపోయి ఉంది ఈదేశం, ఇలాంటి వెధవ లింతమంది ఈ దేశాన్ని ఈ లోకాన్ని ఉంటే వెధవసభలకి, వెధవ అగ్రాసనాధిపతులకు, వెధవసంస్థలకు లోటేం! — జనవాక్యం సత్యం! అందు చేతనే ప్రజాస్వామ్యం, సర్వసామ్యం కావాలని కాశ్మీరంనుండి కన్యాకుమారి వఱకు బంగాళాఖాతంనుండి అరేబియాసముద్రంవఱకు ఏక ఘోషతో మహోగ్రంగా సంచారం చేసేస్తున్నాను.

("టిక్కట్టులేకుండా"అని కేకలు)

వాగనుశాసనుడు

టిక్కట్టెందుకు — అంతామంది — అంతాప్రజలది —ప్రజల్లో ఇలాంటి నీచభావాలు దాస్యభావాలు ఉన్నంతవరకు మనకు స్వరాజ్యంరాదు. ఒక రైల్వేనే సంపాదించకపోతే దేశస్వాతంత్ర్యాన్ని ఎలా సంపాదిస్తాం! — అదికాకుండా నాకోసమూ అంతా మీకోఱకే — ఏంచేసినా మీకోఱకే! ఇలా కష్టపడకపోతే దేశానికి భాగ్యప్రాప్తి ఎలాగా?

— ("సెహబాష్ అనిసభలో కేకలు. దేశంఎలాఉన్నా నువ్వు బాగుపడు తున్నావు" అని కేక)

వాగనుశాసనుడు

నాబాగు ఏముంది! ఇల్లువాకిలి అనిలేక పెళ్ళి పెడాకు

లనిలేక కాయకష్టాలకోర్చి దేశంకోసం మీకోసం ప్రాణం ధారపోస్తున్నా.

("అసలు నీకు ఇల్లూ పెళ్ళీ ఉంటేనా " అనికేకలు)

వాగనుశాసనుడు

ఆలాంటి భావాలే పోవాలి, నా ఇల్లు అని, నా భార్య అని, నా సొమ్ము అని ఉండనే ఉండకూడదు. అది సామ్యవాద సిద్ధాంతానికి ప్రతికూలం అనిమనవి. నాది అనేది మీది అనేది ఈ సృష్టిలో లేదు.

("అందుకే ఎంతమందికో టోపీలువేస్తున్నావు" అని కేకలు)

పల్లెటూరి వ్యక్తి

ఏఁవండోయి! ఆ మధ్యకరణంగారి ఇంట్లోకి ఒచ్చి ఉండి ఉడాయించినోరు మీరుకాదుకదా!

(సభలో ఈలలు, నవ్వులు)

వాగనుశాసనుడు

(మాటలువిననియట్లు) — ఈనాడు మన సభయొక్క ముఖ్యోద్దేశం ఏమిటంటే, ఈ హిందూదేశాన్నే కాకుండా, ప్రపంచాన్ని అంతా —

(సభలో ప్రపంచంఅంతా నీ కూతలు వింటుందా?)

వాగనుశాసనుడు

వినకపోతే వాళ్ళఖర్మం — ప్రపంచాన్ని అంతాకూడా నా అనేది ఉండకూడదు. అది ఉన్నంతకాలం ప్రపంచంలో శాంతియే యుండదు. ఇలాంటి యుద్ధాలకు పరిమితే యుండదు.

డిక్టేటర్లకు లెక్కేలేయే ఉండదు — రక్తప్రవాహాలు పొరలిపోతవి. ప్రపంచంఅంతా అల్లాడిపోతది. కాబట్టి ప్రపంచంలోఉన్న అన్ని వస్తువులు హిమాలయ పర్వతాలైతేనే, అట్లాంటిక్కు సముద్రంఐతేనే, అందరికీ సమానంగా పంచేసి పెట్టించాలి. టాజ్‌మహాలులో ఒక్కొక్కరాయి ఒక్కొక్కడికి ఇచ్చే సేయాలి. టాటస్కాము సమాధిలో ఉన్న ఒక్కొక్క వస్తువు అందర్కికి పంచిపెట్టించాలి. జమీందారీల్ని పట్టాదార్ల భూముల్ని పంచిపెట్టించాలి. ధనవంతుల్ని ఊడదీసేసి వారి సంపత్తు దరిద్రులకు పంచిపెట్టించాలి. దరిద్రుల దారిద్ర్యాన్ని ధనవంతులకి పంచిపెట్టాలి. అనారోగ్యం ఉన్నవాళ్ళకి ఆరోగ్యం, ఆరోగ్యం ఉన్నవాళ్ళకి అనారోగ్యం —

(సభలో చప్పట్లు కొందరు "అదేమిటి అనారోగ్యంకూడా పంచిపెట్టటంవే" — నవ్వులు)

వాగను శాసనుడు

భావోద్రేకంచేత నిశ్శంకగా చెప్పేనేను — వేరుగా తలచవద్దు — (ముఖము తుడుచుకొని) — ప్రపంచం అంతా ఒకట్టి, హెచ్చుతగ్గులులేవు. ఆజ్ఞ అనేది ఉండకూడదు. శాసనాలు అసలే మంచివికావు. పోలీసు అని ఖయిదు లని ముఖ్యంగా తీసివేయించాలి ఎవరియిష్టంవచ్చినట్లు వారు ఉండొచ్చు — స్వేచ్ఛ, స్వేచ్ఛ — అప్పుడే స్వర్గం — భూలోకస్వర్గం — . ఓ మహాజనులారా! మీరు దీనికంతకి మీ అంగీకారాన్ని తెలపాలి! ప్రపంచానికి చప్పట్లతో చాటాలి.

(సభలో చప్పట్లు

పల్లెటూరి వ్యక్తి

ఏం బాబూ, నీకేం దమ్మిడీ గతిలేనోడిలా మాట్లాడతున్నా(వు; — జమీందారుగారి భూములు పంచుకోటం బాగానే ఉందికాని, నాభూమి ఉంటోడికి ఇవ్వటానికి మన సొప్పటం లేదు బాబూ — నీకే(వన్నా ఉంటే ఇలా మాట్లాడతావా బాబూ !

వాగనుశాసనుడు

నేడే ప్రపంచ విప్లవానికి బీజం వేసేము.

(సభలో ఇంక్విలాబ్ జిందాబాద్)

(ఒకవ్యక్తి — నరేంద్రుడు — ప్రవేశించును. కొంచెము దూరముగ)

నరేంద్రుడు

(మెల్లగ) నాహృదయంలోని విప్లవానికి బీజం ఎవరు వేశారు ?

వాగనుశాసనుడు

(ఉద్రేకముతో) నేడే ప్రపంచ పునరుద్ధరణానికి ప్రారంభము. మీహృదయాలే జయభేరులు.

(సభలో జయధ్వానులు)

నరేంద్రుడు

(మెల్లగ, వికటముగ) ప్రజాస్వామ్యము — ప్రజాప్రభుత్వము — ప్రజాస్వాతంత్ర్యము ! —

వాగనుశాసనుడు

మీ సేవకుడను, మీ నాయకుడను — నా ప్రాణాలతో

మిమ్ముల నేకాదు, హిందూదేశంలోని నోరులేనివారి నేకాదు, ప్రపంచంలో, విశ్వంలో ఉన్న అనాధులను అందఱిని కాపాడతా—ధనవంతుల్ని నాశనంచేస్తా—నేనొక అవతారము—మీకు తోచినది ఇచ్చి దేశసేవ మానవసేవ చేయండి — సందేహించకండి — ఇదేసమయం — ప్రపంచం మునిగిపోతుంది.

(సభలో జయజయధ్వనులు)

నరేంద్రుడు

(పెల్లగ) మూర్ఖత — అజ్ఞానము — ఉన్మాదము.

వాగనుశాసనుడు

అలస్యం చేయకండి తోచినది ఇయ్యండి—దేశం అరుస్తుంది — వాగనుశాసనుడను నేను — నేనే — మీ దయ ఉంటే నన్ను అడ్డుపెట్టేవారెవరు లేరు — ఐదువందలమంది పోలీసువారిని ఐనా సరే ఒక్కచేతితో పరుగెట్టించేస్తా—సంఘయుద్ధానికి సంసిద్ధుడను!

(అయిదుగురు పోలీసువారితో ఒక యిన్స్పెక్టరు ప్రవేశించును)

వాగనుశాసనుడు

(అమాంతముగ బల్లమీదనుండి క్రిందికి దుమికి జనులతో కలసిపోవును)

(సభలో కోలాహలము)

ఇన్స్పెక్టరు

ఈ సభ నిషేధింపఁబడినది. మీరు వెడలిపోవలయును తక్షణము. వాగనుశాసనుడనే ఆయనను ఖయిదీగా తీసుకొని వెళ్ళెదము.

వాగనుశాసనుడు

(ఒకని వెనుక నక్కి) ఎదిరించండి — మాట వినకండి.

నరేంద్రుడు

అయ్యా! మీరందరు ఇన్‌స్పెక్టరు మాటవిని వెడలిపోండి.

(సభలో కోలాహలము)

ఇన్స్పెక్టరు

ఇదిగో ఈలవేస్తున్నా. తక్షణం మీటింగును లాటీలతో విడగొట్టేస్తా.

(ఈలవేయును) (సభికులందరు "పారిపోదాం, పారిపోదాం" అని పరుగెత్తిపోదురు. వాగనుశాసనుడు పరుగెత్తబోయి బల్లతగిలి పడును) (పల్లెటూరివాడు పరుగెత్తిపోవును) (ఇక్కడికి రావటంవల్ల పన్నులు తగ్గలేదు కాని తన్నులు వచ్చేయి.)

ఇన్స్పెక్టరు

(వాగనుశాసనుని పట్టుకొని) వాగనుశాసను డనే రౌడీ నువ్వేనా

వాగనుశాసనుడు

అయ్యా! మీరు నన్ను ఆలా అవమానించకండి — నేను అవమానం భరించలేను — నేను వాగనుశాసనుడిని కాను, రౌడీనీ కాను — వాడు నాబద్ధవిరోధి — వాగనుశాసనుడు వట్టి వెధవ, తాగుబోతు, రౌడీల్లో రౌడీ!

ఇన్స్పెక్టరు

అయితే నువ్వెందుకు వచ్చేవు ఈ సభకి — పరుగెత్తడం కూడా ప్రారంభించేవు! అదికాకుండా మాట్లాడుచున్నావు కాదూ బల్లఎక్కి మేము వచ్చినపుడు?

వాగనుశాసనుడు

సెహబాస్ ! — మహబాగావుంది — కాలం అండి. ఒకళ్ళని అంటం ఎందుకు — మంచిచెయ్యబోతే చెడు గెదురు వస్తుంది.

ఇన్స్పెక్టరు

ఏం ?

వాగనుశాసనుడు

ఏం! ఏఁవిటండి — ఇక్కడ జనం మూగేరు ఏఁవైనా గొడవై పోతుందేమో "లా" అన్డు "అర్డరు" భంగంరాకుండా వీళ్ళని వంపించేయాలని వచ్చేను. మనవాళ్ళకి యింకా "సివిక్ సెన్సు" రాలేదండి — ఏదో కొందరైనా సహాయము చేస్తేనేకాని అన్నీ పోలీసువారిమీదే విడిచిపెట్టితే ఏం న్యాయం? సరే ఏఁవైఁతే నేవని వీళ్లు ఎంతవినకున్నా వాగను శాసనుడనే రౌడీగాడితో కొట్టినంత పనిచేసి బల్లఎక్కి వీళ్ళకి నచ్చచెపుతున్నా విప్లవాలే కూడదని.

నరేంద్రుడు

(నవ్వును)

ఇన్స్పెక్టరు

(నరేంద్రునిగాంచి) అయ్యా ఈ మాటలు నమ్మవచ్చా?

వాగనుశాసనుడు

నమ్మటానికి అభ్యంతరం ఎందుకండి — ప్రాణం పోయినా అబద్ధం ఆడనండి — (నరేంద్రునిచూచి) అయ్యా తమరు నవ్వి నాకు అన్యాయం చేయుటం ధర్మంకాదు. తమరు అప్పుడు

లేందేనా. ఉన్నా సరిగ్గాచూచి యుండరు — (సమీపించి) (మెల్లగా) మహాత్మా, మీకాళ్లు పట్టుకొంటా రక్షించాలి — నేను ఎవడికీ అపకారంచేయను — నాభార్య చచ్చిపోతుంది — డబ్బులేక ఈ సభలో ఉన్న వెధవల దగ్గరనుంచి నాల్గుడబ్బులు లాగాలని నాల్గుమాయమాటలు చెప్పేను — అంతే — ఒట్టు వేయమన్నా వేశేస్తా! — మీకు ఎప్పటికీ సేవకుడుగా ఉంటా. ఈమారు కాపాడాలి — నాకు పోలీసువాళ్ళ లాటీలన్నా, ఖయిదు అన్నా చాలాభయం — బాబూ ఇంకెప్పుడూ ఈలాంటివాటికి వెళ్ళను. నా పెళ్ళాంతోడు. (బిగ్గరగ) అయ్యా! నిజం ఇన్స్పెక్టరుగారితో చెప్పండి. తమకేమి తెలియదనే సంగతి. నిరపరాధిని అపరాధిగాచేస్తే దైవం మెచ్చుతాడా మహాశయా! — అయ్యా! ఇన్స్పెక్టరుగారూ! నిజంచెప్పేను నాకు ఏంవైనా భయంలేదు. కాని నాభార్య చచ్చిపోతుంది. వెళ్ళాలి — తరువాత మీ ఇష్టం.

నరేంద్రుడు

(ఇన్స్పెక్టరును సమీపించి మాటలాడును)

ఇన్స్పెక్టరు

సరే — (వాగనుశాసనుని చూచి) ఇల్లాంటి సభలతో ఎప్పుడూ జోక్యం కలుగజేసుకోను అని వ్రాసి ఇయ్యి — విడిచిపెట్టేస్తా.

వాగనుశాసనుడు

ఓ! ఈ మాత్రానికే ఇంత హడావిడి ఐపోయింది. లక్షకాగితాలు వ్రాసిఇస్తా — ఐనా నిజం వ్రాయడానికి నా

అంతర్వాణి ఏమీ అభ్యంతరంపెట్టదు. — అయ్యా ప్రాణం పోయినా నా అంతర్వాణికి వ్యతిరేకంగా చేయను — కాగితం ఉంది — కలం ఇప్పిస్తారా?

ఇన్స్పెక్టరు

(ఇచ్చును)

వాగనుశాసనుడు

(వ్రాసి కాగితము ఇచ్చును)

ఇన్స్పెక్టరు

(చదివి) సరే — ఎప్పుడు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే అప్పుడే దొరుకుతారు మనుష్యులు ఎక్కడున్నా.

వాగనుశాసనుడు

అయ్యో మర్చిపోయేను — (కలం ఇచ్చి) కాని నామాట నమ్మకపోతే నాకు శిరచ్ఛేదం! — పోనీ మీ ఇష్టంవచ్చినట్లు చేసుకోండి.

ఇన్స్పెక్టరు

ఐతే మాతోరా.

వాగనుశాసనుడు

(కంగారుతో) (అర్థోక్తి) ఇదేంటీకథ అడ్డంతిరిగింది. ఇన్స్పెక్టరు గారు! వ్రాసియిచ్చే కాదండి, మళ్ళీనేను మీతో రావటం ఎందుకండి! మీకు శ్రమ అనవసరం.

ఇన్స్పెక్టరు

(నవ్వుచు) సరే! (నరేంద్రునిగాంచి)అయ్యా శలవు. సరే—శలవు.

వాగనుశాసనుడు

(ఇన్స్పెక్టరునిచూచి) అయ్యా శలవండి.

(ఇన్స్పెక్టరు పోలీసులు నిష్క్రమింతురు)

వాగనుశాసనుడు

అయ్యా! ఈ పోలీసులు చాల రూడ్ ఫెలోస్ అండి. మర్యాదే లేదు. నేను మర్యాదగా 'శలవు' అంటే ఏమి అనకుండా పోయేడు చూసేరా!

నరేంద్రుడు

(నవ్వు)

వాగనుశాసనుడు

తమకు నేను ఎలా ఋణంతీర్చుకోవాలో తెలియదు!

నరేంద్రుడు

దానికేంవుంది!

వాగనుశాసనుడు

అబ్బే అలా అనకండి — చాలా పొరపాటు — ప్రపంచాన్ని రాబట్టవలసిందంతా రాబట్టాలి! — అందులో . నాలాంటి వాడున్నాడే — ఓ, చాలా ఉపయోగకారి. నాకు అనుభవం ఉంది. మహాశయా! ఎలాంటి పనిఏనా చేసేస్తాను ఒక్క నిముషంలో.

నరేంద్రుడు

(నవ్వి) మీరు మీ సంగతి కొంచెం శలవిస్తారా?

వాగనుశాసనుడు

సెహబాష్ — మర్యాదస్తులకి మిగతావాళ్ళకి అదేభేదం — ఎంత మర్యాదగా మాట్లాడతారు తమరు — తమకి అగాడిద కొడుక్కి భేదం చూపెండి.

నరేంద్రుడు

వారిని దూషించకూడదు.

వాగనుశాసనుడు

అదేం తప్పులేదు "సర్" — దూషించేచోట దూషించాలి, భూషించేచోట భూషించాలి. నేను అదీ లెక్కచేయను, ఇదీ లెక్కచేయను — గీతలోలేదు 'సర్' మరీ దూషణ భూషణ సమానంగా చూడమని — మనపూర్వులు తలతిక్క ముండాకొడుకులైనా కొన్నికొన్ని విషయాల్లో చాలా తెలివి గలవాళ్లు — వాళ్ళమాటలు కొన్ని "కామన్ సెన్సు" కలిగి చాలా యుపయోగంగా ఉంటాయి — ఒకటి ఉదహరిస్తాను — స్త్రీల విషయమై, డబ్బు విషయమై, మానం విషయమై, ప్రాణంవిషయమై ఏమైనా సంభవిస్తే అబద్ధం చెప్పేయమని శాసించేరు — చూడండి ఎంత "ప్రాక్టికల్".

నరేంద్రుడు

మీ చరిత్ర.

వాగనుశాసనుడు

నా చరిత్రకి ప్రపంచ చరిత్రకి భేదంలేదు. అంతా చరిత్ర —

నా చరిత్రకి అది ముఖ్యం — దానికి నా చరిత్ర ముఖ్యం — అంతా ఒకటే — ఐనా చెప్తాతా నావిషయం.

నరేంద్రుడు

మీరు సత్యం చెపుతారని నమ్ముతాను.

వాగనుశాసనుడు

అభ్యంతరం కాని, ఆటంకం కాని, హానికాని లేనంతవఱకు సత్యమే ఎప్పుడూ చెపుతాను. అసలు నాకు నిజం చెప్పటమే ఇష్టం. కాని అది వీల్లేనపుడు అబద్ధం చెప్పవలసి వస్తూంటుంది — చూడండి సర్, బాగాచూస్తే అంతా నిజఁవే, అంతా అబద్ధఁవే — భేదమేమిటి ? — జగమంతా మిధ్య అని శంకరాచా—

నరేంద్రుడు

మీకు నేను హానిచేస్తానా, సత్యంకావాలి.

వాగనుశాసనుడు

నిజంచూస్తే — హాని, మంచి మనకి ఇతర్లు చేయలేరు. మనలోనేఉంది అది అంతా! — సరే దానికేం కాని నా సంగతి చెపుతా — సత్యఁవే — నాన్కోవరేవను రోజుల్లో చదువు మానేశాను - నాకు తల్లితండ్రిలేరు - పెళ్ళిచేసుకోమంటే మావాళ్లు, ఇంట్లోనుంచి పారిపోయాను — ప్రజాసేవ చేస్తూ నా ఉదరపోషణం చేస్తున్నా. డబ్బు కొన్నాళ్లు మావాళ్ళదగ్గర నుంచి ఆత్మహత్య చేసుకుంటానని చెప్పి లాగేను — ఆఖరికిచస్తే పీడవదలుతుందని వాళ్లు జబాబే ఇవ్వలేదు — అప్పుడు "అవని అంతా అక్షయపాత్ర" అని దేశంమీదపడ్డా — కవిత్వంచెప్పి

కొందరిదగ్గర, వేదాంతంచెప్పి కొందరిదగ్గర, ఉపన్యాసాలిచ్చి మరికొందరిదగ్గర, నిజంచెప్పి, అబద్ధంచెప్పి, కన్నుగీటి, చిరునవ్వునవ్వి, ఏడ్చి, ఏవోవోచేసి, దేశంఅంతా తిరుగుతూ బ్రతుకుతున్నా. అనంతమైన శక్తి ఉన్నది- కాని డబ్బులేక పోవటం చాలా పెద్ద "హాన్డికాప్ సర్" - లేకపోతే ఏ హిట్లరునో, ఏముస్సోలినీనో, ఏస్టాలిన్నో ఐపోను? - ఇది నాహిస్టరీ.

నరేంద్రుడు

ఐతే మీకు భార్యలేదూ?

వాగనుశాసనుడు

(నవ్వి) లేనట్టేనర్ _ ప్రాణంమీదికి వచ్చిందని పోలీసు వాళ్ళదగ్గర ఒకచిన్న ప్రయోగంచేశాను.

నరేంద్రుడు

నిజంచెప్పినందుకు ఇదిగో, (ఐదు రూపాయలిచ్చును.)

వాగనుశాసనుడు

చాలా ధన్యవాదాలు, చాలాచాలాధన్యవాదాలు ఇలా ఐతే, ఎప్పుడూ నిజమేచెప్తాను.

నరేంద్రుడు

(ఇంకొక ఐదు రూపాయలిచ్చును)

వాగనుశాసనుడు

మహాదాత, మహాదాత, (కండ్లకుఅద్దుకొనును) — నిజం ఎప్పుడూ ఇంత 'పే' చేయలేదు సర్.

నరేంద్రుడు

సత్యంలో ఎంతో ఆనందంఉంది-అదిఅందరూ గ్రహించలేరు.

వాగనుశాసనుడు

(నరేంద్రునిచూచుచు) — ఆర్యా! తామెవరో నాకు తెలియదు — తమదయకు కారణం అసలే తెలియదు.

నరేంద్రుడు

నాకే తెలియనివిషయం మీకెలా చెప్పగలను!

(చిరునవ్వు)

వాగనుశాసనుడు

తమకు నాపై యీ దయకు కారణం?

నరేంద్రుడు

కారణం ఎందుకు?

వాగనుశాసనుడు

ఈ దయకు పాత్రత్వం నాలో ఏం వుంది?

నరేంద్రుడు

అపాత్రత మట్టుకు ఏం వుందీ?

వాగనుశాసనుడు

(ఆశ్చర్యముతో చూచును)

నరేంద్రుడు

నాదగ్గర నాలుగునెలలు ఉంటారా? [illegible]

లోపాలు కలుగకుండా ఉండేలాచేస్తాను.

వాగనుశాసనుడు

నాలుగునెలలు కాదు. నలభై సంవత్సరాలైనా సేవ చేస్తాను. మహాభాగ్యం!

నరేంద్రుడు

సరే — ఇప్పుడేఖాయం — కాని ఒకమాట మీ ద్వారా నేనొక క్రొత్తపద్ధతిని ప్రయత్నిస్తాను. నాపద్ధతి ఫలవంత మైతే ఈ ప్రపంచంలో ఒక క్రొత్తజ్యోతి వెలుగగలదు. — కాని ఈ క్రొత్తపద్ధతి అమలులో పెట్టుటలో నేను చెప్పినట్లు మీరు చేయవలయును — కష్టమని వెనుకతీయకూడదు — నా శిక్ష ఒకానొకప్పుడు కఠినమై క్లిష్టతమమై ఉండొచ్చును. నేను సాధనలో క్రూరునిగా మీకు కనుపించవచ్చును — దానికి వేనికి మీరు అలజడి పడకూడదు — ఈయత్న సాఫల్యముపై మానవయత్న సాఫల్యము ఆధారపడియున్నది.

వాగనుశాసనుడు

మహాసంతోషం — కాని ప్రాణభయం లేదుకదా!

నరేంద్రుడు

లేదు — ఏమీ, భయంగావుందా?

వాగనుశాసనుడు

అబ్బే! అనవసరంగా ఒక ప్రాణంఐనా పోవటం ఎందుకని. కాని ఆర్యా! ఒకమాట. తమకు కోపం రాదుకదా!

నరేంద్రుడు

అడగండి, మీ ఇష్టంవచ్చినట్లు స్వేచ్ఛగా మాట్లాడాలి. కోపంరాదు లెండి (నవ్వు).

వాగనుశాసనుడు

తమ కేవిధమైన పనీ లేనట్లుఉంది, క్షమించండి.

నరేంద్రుడు

(చిరునవ్వు) ఏం ?

వాగనుశాసనుడు

ఏ పనీలేనివాళ్లు ఇలాంటి అనవసరమైన పనులు చేస్తుంటారు. లేకపోతే ప్రపంచంగొడవ, మానవ సౌఖ్యం గొడవ స్వంతపని ఉన్నవాడికి నిజంగా ఏంకావాలీ ?

నరేంద్రుడు

(మందహాసముతో) నిజమే — (ఆలోచించి) నిజంగా నాకు ఏవిధమైన పని నాకు సంబంధించింది ఈ ప్రపంచంలో లేదు. — శూన్యహృదయము, శూన్యహస్తము. శూన్యాకారము.

వాగనుశాసనుడు

ఆర్యా ! తమరు — (సందేహించి) క్షమించాలి — తమ అను వర్తిని, తమకై ప్రాణమైనా ఇచ్చేసే ఉద్దేశంలో ఇప్పు డున్నాను. కృతజ్ఞత సర్, కృతజ్ఞత — ఆఁ కాబట్టి తమ హృద యంలోని భావాల్ని తెలిసికొంటేనేగాని, ఎలా సేవచేయగలను?

నరేంద్రుడు

ఔను.

వాగనుశాసనుడు

అయ్యా తమరు ఒక చిన్న మెఱుపుచేత కండ్లు చీకట్లు కమ్మబడి, ఒకవిధం ఐన పిడుగుదెబ్బకి ఆహూతి ఐనట్లున్నారు – (చిరునవ్వు)

నరేంద్రుడు

ఏమిటదీ !

వాగనుశాసనుడు

ఒక స్త్రీ –

నరేంద్రుడు

(తేరి పారచూచి) (శిరఃకంపము)

వాగనుశాసనుడు

నాటకానికి సూత్రధారుడులాగ ఈ ఆడవాళ్లు ఎక్కడో ఒకచోట ఉండితీరాలి! "ప్లెజంటు"గానే ఉంటుందికాని సర్, ఒకొకమారు "డామ్ న్యూశన్సు" ఔతారు వీళ్లు.

నరేంద్రుడు

నా జీవితంలో ఒక స్త్రీఉన్నదని మీరెలా ఊహించేరు ?

వాగనుశాసనుడు

అదేసర్ – "సైకిక్ పవరు" అంటేను – వాగనుశాసనుడు అసాధ్యుడు (చిరునవ్వు) చూడండి లేకపోతే శూన్య హృదయం "శూన్యహస్తం" మొదలైన మాటలు శుభ్రంగా యున్న మామూలు వాళ్ళకిరావు. ఇలాంటి మాట్లకి కారణం ఒక విధమైన ఉన్మాదం సర్ – కోపంవద్దు – తమ హృదయం యొక్క స్థితిచూచి కలతపడి ఇలా అనవలసి వచ్చింది.

నరేంద్రుడు

తప్పులేదు. నిజమే.

వాగనుశాసనుడు

చూడండి అయ్యా! ఒకటి కాకపోతే దాన్ని మించిన వాళ్ళు లక్షమంది వస్తారు — నావాదం, మతం ఎప్పుడు అంతే.

నరేంద్రుడు

(చిరునవ్వు) — కాని ఆమె అసాధారణ, అనన్య.

వాగనుశాసనుడు

నాకు నమ్మకం లేకపోయినా, తెల్లకాకిఅంటే, తెల్లకాకే అనాలి.

నరేంద్రుడు

అలా అనవద్దు.

వాగనుశాసనుడు

వద్దంటే, తమ ఇష్టం, నా ఇష్టమున్నా — నల్లకాకిఐనా తెల్లకాకి అనాలి అది అంతే. అబద్ధం చెప్పటంకాదు — తమయెడల నాకున్న కృతజ్ఞత, భక్తి అలా అనిపిస్తుంది నల్లకాకి తెల్లకాకి లాగే మారిపోతుంది.

నరేంద్రుడు

నాకు సత్యం అంటే చాలా ఇష్టం.

వాగనుశాసనుడు

నాకు తెలుసును.

నరేంద్రుడు

(నిట్టూర్పు)

వాగనుశాసనుడు

ఆమె ఎవరో చెప్పండి — వాగనుశాసనుడున్నంతకాలం — వాడు నూరేండ్లు, ఊఁ — ఒక నూరే ఏమిటి వెయ్యేండ్లు బతికి ఉండాలి — తమకి అసాధ్యం అనేదే ఉండదు.

నరేంద్రుడు

ఆమె ఎవరో నాకు తెలియదు — ఒక్కమారే చూసేను. ఒకనిముషం. కలలోని మెఱుపు.

వాగనుశాసనుడు

మీా జీవితంపై అశనిపాతం.

నరేంద్రుడు

మాట్లాడనే లేదు.

వాగనుశాసనుడు

మూగదేమో!

నరేంద్రుడు

ఒక్కక్షణము ఎతమాత్రం. కనురెప్ప వేయకుండా చూచింది.

వాగనుశాసనుడు

గ్రుడ్డిదేమో ?

నరేంద్రుడు

అంతలో మాయమైపోయింది దేవత.

వాగనుశాసనుడు

యక్షిణియేమో !

నరేంద్రుడు

అదే ముందుచూపు, అదే ఆఖరిచూపు.

వాగనుశాసనుడు

అయ్యో ! ఇది చాలా ముదిరిన స్థితి — నిజంగా ఇది చాలా "డర్టీహాబిట్" — ఆడవాళ్ళ విషయం ఇంత గడబిడ చేయకూడదు — ఋతువుల లాగ వాళ్ళు వస్తూంటారు, పోతూంటారు. వీళ్లైనప్పుడు "యస్" లేకపోతే "నో" అంతే. ఇలాంటి మనోస్థితినే శంకరాచార్యులు మొదలైన మహావేదాంతులు చెప్పేరు.

నరేంద్రుడు

శంకరాచార్యులంటే మీకు అభిరుచా !

వాగనుశాసనుడు

అందరియందు అభిరుచే. కాలాన్ని బట్టి, విషయాన్ని బట్టి, మనయొక్క అనుకూలంకోసం వాళ్ళందరు పుట్టబడినట్టుగా, వాగినట్టుగా మనం వ్యవహరించాలి. వాళ్ళకోసం మనం కాదు.

నరేంద్రుడు

(నవ్వు నాపుకొని) తమ మతం ?

వాగనుశాసనుడు

నామతం నాది — ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం, బౌద్ధం — పాషండం, మ్లేచ్ఛం, ఇవి అన్ని నా మతానికి సమ

యాలనిబట్టి వహాయ కారులు — నాకు ముఖ్యాంవైంది, నా అంతర్వాణి.

నరేంద్రుడు

అదీ మీ ఆధీనములోదేనా ?

వాగనుశాసనుడు

తప్పకుండా — అంతరింద్రియ నిగ్రహం అంటే అదేకాదు!

నరేంద్రుడు

చకుముకే !

వాగనుశాసనుడు

(అదరిపడి) ఆఁ!

నరేంద్రుడు

ఇంత మఱుపా, జ్ఞాపకంలేదా ?

వాగనుశాసనుడు

(బాగుగాచూచి) నరేంద్ర —

నరేంద్రుడు

ఔను !

వాగనుశాసనుడు

(కాళ్లు పట్టుకొనిలేచి, కౌగలించుకొని, విడచి) నరేంద్రా ! ఎన్నాళ్లకు దర్శనం — కాని ఇంత మారిపోయావే, ఇంత చిక్కిపోయావే—మీసంకూడా తీసివేశావే — ఎంత "బ్లాక్ హ్యాండ్" ను ఐపోయాను — ప్రమాదోధీమతాం — కాని ఇంత మారిపోయినావే !

నగేంద్రుడు

(నవ్వి) చకుముకీ, ఎప్పుడూ ఒక విధంగానే ఉంటావా! — కాలం జరిగిపోవటం లేదూ?

వాగనుశాసనుడు

ఇవ్వేళ సుదినం — విద్యాభ్యాసం దినాలలో నా ప్రాణ స్నేహితులు నన్ను చకుముకీ అని పిలిచేవారు — మళ్లీ ఇన్నాళ్ళకి ఆమాట విన్నాను—కాని వాళ్ళంతా వట్టి చాటపెయ్యలు కాదూ! కాని అదృష్టం బాగుంది. కాని నువ్వు ఒక్కడవే చాటపెయ్యకానిది —

నగేంద్రుడు

ఆరోజులు ఎంతో జ్ఞాపకం ఉన్నాయి.

వాగనుశాసనుడు

ఉండవూ! నాలాంటివాడికి తిండానికి తిండిలేని దౌర్భాగ్య వెధవలికి రెండుకాసులు ఏ వెధవముండో ఛస్తే వచ్చేటప్పటికి జ్ఞాపకాలు పోతాయికాని, నీలాంటివాళ్ళకేం — నాకు బాగా జ్ఞాపకం — ఒకనాడు ఉసిరికాయలు కోస్తూ నూతిలోపడితే నీవు దూకి రక్షించేవు. ఇంకోమాటు పరీక్షలో 'కాపీ' చేయబోతుంటే — చదివి వడిస్తేకాదూ ఆపాడు "ఫాక్టసు" — వాచరుచేతులోంచి రక్షించింది నువ్వేకాదూ!

నగేంద్రుడు

చకుముకీ, నిన్నుచూచి చాలా సంతోషం ఐంది. నువ్వు నన్ను గుర్తుపట్టవని తెలుసును.

వాగనుశాసనుడు

ఇలా మారిపోతే తప్పెవరిది — లేకపోతే వాగనుశాసనుడు 'అలంకృత్' చక్రవర్తికి మాంద్యమా! — అందులో నీ రాక్షీ కష్టాలతో కాగిగిన శరీరం.

నరేంద్రుడు

(నవ్వు)

వాగనుశాసనుడు

నువ్వు నాచే చెయించే గొప్పకార్యం ఏమిటి ?

నరేంద్రుడు

నిన్ను — ప్రతి మనుష్యునిలోను ఒకవిధం ఐన గొప్పతనం ఉంది. మహా నరహంతకునిలోకూడా మహాత్మ్యం ఎక్కడో ఒక చోట ఉంటుంది. ఆ గొప్పతనం, ఆ దైవికసంబంధమైన మానవత్వాన్ని గ్రహించకపోవటంచేత, అదికప్పబడిపోయి, మానవులు రాక్షసులక్రిందమారి పనికిమాలినవాళ్లు ఔతున్నారు. అంచేతనే ఈ యుద్ధాలు ఈ కాపట్యం—క్రౌర్యం— ఈ అశాంతి— ఈ దుఃఖం.

వాగనుశాసనుడు

ఉండనీయ్, మనకేం! ఈ అనవసరపు గొడవలు మనకెందుకు — ఎవరిఖర్మం వాళ్ళది.

నరేంద్రుడు

అలాకాదు. విశ్వమానవ హృదయం ఒకటే — అంతా ఏకం — తెలియక గోళభేదాలతో ఖండభేదాలతో దేశభేదాలతో, పురభేదాలతో, మానవభేదాలతో కుళ్ళిపోతున్నా —

ఒకచిన్నిక్రిమియొక్క బాధ విశ్వాన్ని అంతా ఇంతో అంతో కదలచేసి కలతపెట్టకమానదు. అది మనంగ్రహించం. మెదడులో మెఱసిన ఒకజ్ఞానపు మెఱుపు విశ్వలోకాలకి ఒకవిధం ఐన వెలుతురిని ఇవ్వదూ!

వాగనుశాసనుడు

ఇది చాలా ఎక్కువగా ముదిరిన ఉన్మాదావస్థ.

నరేంద్రుడు

చూడు చెకుముకీ ప్రపంచంలో ఉన్నా అలజడి, అజ్ఞానం, బాధ నిన్ను కలతపెట్టవూ ?

వాగనుశాసనుడు

కొంచెం ఐనా! ఎందుచేత అంటే అవే నన్ను ఇన్నాళ్ళు పోషించేయి — అదికాకుండా, అవే లేకపోతే శాంతి, జ్ఞానం, సుఖాలయొక్క రుచి ఎలా తెలుస్తుంది — "ఐస్ సీను" యొక్క "రిలెటివిటీ" ఏంవిటి !

నరేంద్రుడు

(చిరునవ్వు) — నవ్వుకాదు — ఇది అంతా కార్యం, కృషి — చూడు — ఆలోచించు — "సర్వేజనాః సుఖినోభవంతు" అనే మహావాక్యం మనకు ఎలా గగుర్పాటు ఇస్తుందో!

వాగనుశాసనుడు

అంతకన్నా "సోహం" అనేది ఎక్కువగా గగుర్పాటు ఇస్తుంది — నరేకాని ఈ విశ్వవిప్లవంలో నావని ఏంవిటి !

నరేంద్రుడు

నీలో ఉన్న ఉత్తమగుణాలని దైవతత్వాన్ని పైకితీసుకొచ్చి, నీలోని చెడ్డని పారద్రోలి, నిన్ను మానవసంఘానికి బరువు గాకుండా, ఉపయోగకారిగచేసి ఈపద్ధతిని, అనేక జనులయెడల ప్రయోగించి వారినందరిని సత్యమానవులుగా సంఘసేవకులుగా చేసి, ఈ ప్రపంచ సౌఖ్యానికి ఒక క్రొత్తవిధానం చూపించాలని నా ఉద్దేశం.

వాగనుశాసనుడు

నన్నేమి మారివేస్తావా ? — నీ విధానం ఏమిటి ! —

నరేంద్రుడు

తరువాతచెప్తాతా !

వాగనుశాసనుడు

నన్నే ఎందుకు ఏరేవు.?

నరేంద్రుడు

నీవు చాలా తెలివిగలవాడవని ఒకటి.

వాగనుశాసనుడు

సెహాభాష్ !

నరేంద్రుడు

నిజంగా శక్తిగలవాడవని ఒకటి.

వాగనుశాసనుడు

బాగు, బాగు, ! (హర్షము)

నరేంద్రుడు

మూడవది — పట్టి పనికిమాలిన చాటపెయ్యేవని.

వాగనుశాసనుడు

(తెల్లబోయి) అదేఁవిటి !

నరేంద్రుడు

(నవ్వి) ఇవన్నీ ఉండబట్టి నా క్రొత్త విధానాన్ని అమలులో పెట్టడానికి తగినవాడవు.

వాగనుశాసనుడు

మొదటి రెండు బాగున్నాయి — ఆఖరిదికూడా పరవాలేదు — ఏదో స్నేహారీత్యా పరిహాసం చేసేవు — దానికేం —

నరేంద్రుడు

రా వెళదాము — ఆలస్యమైపోయింది.

వాగనుశాసనుడు

మహానంతోషం — ఆకలివేస్తోందికూడాను — ఆమిాటింగులో ఆ పందల చెవుల్లో అరచి అరచి గొంతుకు ఎండిపోయింది.

నరేంద్రుడు

చకుముకీ, నా జీవితంకూడా ఎండిపోయింది సుమా.

వాగనుశాసనుడు

మళ్ళీ ఆధోరణిలో పడకు గొప్పకార్యం తలచేవు — తలచేవు ఏమిటీ, — తలచేం ! రా !

(నిష్క్రమింతురు)

తెర పడును

# "తీరని కోరిక - తరువాత"

## ద్వితీయాంకము

ooooOooo

### ఒక సంవత్సరము పిదప

ప్రదేశము (నరేంద్రుని అంతరంగిక దర్శనాగారము)
ప్రవేశము (చుట్ట కాల్చుచు, వాగనుశాసనుడు)

వాగనుశాసనుడు

శెభాస్ చెకుముకీ, శెభాస్ — (మందహాసముతో) నీదే జాతకం — దమ్మిడీ ఖర్చులేదు మహారాజభోగం — అప్పుడదీ, ఇప్పుడిదీ — ఊం — కానీ ఒక వెలుగు వెలిగేస్తున్నావు — కాని అప్పుడప్పుడు నరేంద్రుడు చాలా కఠినంగా ఉంటాడు — ఒకమాట, నాలో ఏదో దైవత్వం అంట — వల్లకాదు — దైవత్వం ఉంటే ఇలా ఉంటాను — నాలోని దైవత్వాన్నో లేకపోతే ఉత్తమ మానవత్వాన్నో పొంగించాలని అసాధ్యం ఐన పనులు చేయుమని చంపేస్తాడు — కళ్లు మూసుకుంటాడు — వెఱ్ఱివాడు లాగు చూస్తాడు — నన్నుకూడా కళ్లు మూసుకొని ఏవేవో గొప్ప విషయాలు తలచమంటాడు — దుష్టాలోచనలు రాని వ్వొద్దంటాడు — ఆకలేస్తుంటే ఓర్చుకోమంటాడు — ఒకడిమీద కోపం ఒద్దంటాడు — ఈప్రపంచం అశాశ్వతం అంటాడు — అలాగ "ఫీల్" అవమంటాడు — ఆడవాళ్లతో కొంచెం "ఫ్రెండ్లీ"గా ఉంటే, "చకుముకీ, చాలు ఈపిచ్చిపనులు" అంటాడు —

ఏవేవో చదవమంటాడు — ఒకసారి వాదించమంటాడు — ఇంకో నాడు నోరుమూసుకొని, వినమంటాడు — ఒక చిన్న అబద్ధం కూడాచిలోక్కికైనా ఆడొద్దంటాడు — ఎన్నెన్నో నియమిస్తాడు, బద్ధకం చేస్తే దండించేస్తాడు — నేనొక యంత్రాన్ని ఐపోయాను— నన్నొక "ప్లాను" క్రింద పెట్టేసేడు — సత్యమైన జీవనం జీవించ మంటాడు — ఒకటా, ఏదో గాడిద గత్తర — నన్ను మార్చే స్తాడట — నన్నొక మహాత్ముడిగా మార్చేస్తాడట — ఈయన తరంవా — అవక తవక చేష్టలు చేసేవాడిని నేనవుతానా ! — ఐనా మొత్తంమీద "లైఫ్" చాలా "ప్లెజంటుగా" గా ఉంది— కాని ఈ నౌకరు గాడిద కొడుకులతో మట్టుకు అంత సరసంగా లేదు — నా పూర్వస్థితి తెలుసును ఈవెధవలకి — ఎంత వినయంగా ఉన్నా, చాటున నవ్వుకుంటున్నట్టు కనిపెట్టేను — "యూస్‌లెస్ ఫెలోస్" — వీళ్ళకి నన్ను చూస్తే నవ్వా! ఈ పనికిమాలినవాళ్ళకి బట్ట లేసుకొని తిరగటంవే, తప్పో, వీళ్ళకి తల వదీ — "డమ్ముబషోస్" కొంచెం అథారిటీ చెయ్యాలి — అరే —

(సేవకుడు ప్రవేశించును.) — చిత్తం —

వాగనుశాసనుడు

నీ చిత్తంవాం, నా చిత్తంవాం !

సేవకుడు

తమరే — (నవ్వ నాపుకొనును.)

వాగనుశాసనుడు

ఎందుకోయ్ ఆ మందహాసము — భయభక్తులు లేవు — జాగ్రత్త "డిసిప్లిన్" నేర్చుకో.

సేవకుడు

క్షమించాలి —

వాగనుశాసనుడు

భేష్ బాగు — తప్పకుండా క్షమిస్తాను — భగవంతుడు క్షమించడూ — అదేవిధంగా నేనూ — చూడు — మిగతా వాళ్లని కూడా నీ మోస్తరుగా వినయంగా ఉండమని చెప్పు — ఇదిగో ఈ "సిగార్" తీసుకో (జేబులోది తీసి ఇవ్వబోవును)

సేవకుడు

ఇది ప్రభువుది — నేను తీసుకోజాలను — క్షమించాలి.

వాగనుశాసనుడు

ప్రభువు దేవిఁటీ నా దేవిఁటీ, భేదంలేదు — అంతా ఒకటే —

సేవకుడు

క్షమించాలి.

వాగనుశాసనుడు

(జేబులో పెట్టుకొని) నీ ఖర్మం — నాకేం — సరేకాని "టీ" తీసుకురా పోయి — "టీ" అంటే నరేంద్ర మహాశయులు తీసికొనే "టీ" నీళ్లేకావు — మిగత సామగ్రి అంతా!...

సేవకుడు

చిత్తం —

వాగనుశాసనుడు

చూడు ఆమె ఎక్కడుంది ?

సేవకుడు

ఏమో నాకు తెలియదు (నిష్క్రమించును)

వాగనుశాసనుడు

" ఇంపర్టినెన్స్ "

నగేంద్రుడు

(ప్రవేశించి) ఏం !

వాగనుశాసనుడు

అబ్బే ఏమీ లేదు —

నరేంద్రుడు

చకుముకీ సత్యం —

వాగనుశాసనుడు

ఆమె, తిలోత్తమ ఎక్కడుందో " టీ " అదీ ఇచ్చేరో లేదో అని కనుక్కోబోతే సరియైన జవాబియ్యకుండా పోయేడు —

నరేంద్రుడు

ఆమె విషయమై నీకింత శ్రద్ధ, బాధ అనవసరమేమో !

వాగనుశాసనుడు

అబ్బే, ఏదో ఒక ఇంట్లోవాళ్ళంకదా అని కాని, లేకపోతే నాకేం సంబంధం.

నరేంద్రుడు

చకుముకీ — నీవు వెళ్లి ఆమెను తీసుకొనిరా.

వాగనుశాసనుడు

(ఆశ్చర్యపడును)

నరేంద్రుడు

సందేహం పోగొట్టుకోండి నిజమైనది. “గతి” నేను కాదు.

వాగనుశాసనుడు

(నిష్క్రమించును)

నరేంద్రుడు

చకుముకీయొక్క ఉత్థానం ఎంత కష్టంగా ఉందో తిలోత్తమ యొక్క ఉత్థానం అంత తేలికగా ఉంది — అమెలో చెప్పలేని గొప్పతనం వెలుగుతుంది. ఆ దేవిని ఏలా ఎరుగుందినో పతితులను, ఉత్తములైన సత్యమానవులుగా మార్చగలుగుతే, నా శిక్షావిధానాన్ని ప్రకటించి, మానవోద్ధరణానికి ఒక మార్గం చూపితే నిరర్థకమైన నా జీవితానికి కొంత అర్థం కలుగుతుందేమో!—
(సిగరెట్టుతీసి కాల్చుచుండును)

(తిలోత్తమ, వాగనుశాసనుడు ప్రవేశించుదురు, తిలోత్తమ మహా సౌందర్యవతి)

నరేంద్రుడు

తిలోత్తమా కూర్చో — చకుముకీ, నీవుకూడా!

(కూర్చుందురు)

వాగనుశాసనుడు

తిలోత్తమా, ఒకడు నీ విషయమై చాలా శ్రద్ధ తీసుకుంటు న్నాడు సుమా! దానికి కారణం నీ రూపం, నీ యౌవనం!

తిలోత్తమ

(నరేంద్రుని తేరి పారచూచి కొంచము తలవంచును)

[illegible]

తిలోత్తమా, సిగ్గెందుకు? సత్యములో దానికి తావు లేదు — ఇదిగో ఈ చకుముకికే నీ రూపం భ్రమింపచేసింది.

నరేంద్రుడు

(కంగారుతో సిగరెట్టు అంటించును)

తిలోత్తమ

(తలయెత్తి నరేంద్రుని నిస్పృహతో చూచి) చకుముకా! — (వికట మందహాసము) చకుముకికే కాదు — చకుముకివంటి వారు లక్షమంది నా రూపానికి భ్రమించిపోయేరు, పోతారు — నరేంద్రా! స్వేచ్ఛగా మాట్లాడనా?

నరేంద్రుడు

తప్పకుండా — స్వేచ్ఛ సత్యమును ఒకటే, అదే కాదూ మానవత్వం?

తిలోత్తమ

నన్ను చూచి భ్రమించని మొగపురుషుడు లేడు. సాధారణంగా, పురుషులేమిటి, స్త్రీలుకూడా మోహిస్తూంటారు నన్ను చూచి — హృదయం అనేది ఉన్న ప్రతి మానవుడు నాకు దాసుడు.

నరేంద్రుడు

(లేచి, సిగరెట్టు నామెకిచ్చుచు) ఏకు కాదమ్మా నీ రూపానికి,

తిలోత్తమ

(స్వీకరించి) నేనే నా రూపం, నా రూపానికి నాకు భేదంలేదు.

నరేంద్రుడు

(అంటించుచు) తిలోత్తమా! రూపం శాశ్వతమా? నీ హృదయం, నీ ఆత్మ శాశ్వతములు.

తిలోత్తమ

(పొగపీల్చుచు) నరేంద్రా! సత్యాన్ని చెప్పేశక్తి నీవు ఇచ్చేవు-నిజంగా, శాశ్వతత్వంతో నాకు సంబంధంలేదు. ఇప్పుడున్నదే సత్యం — అదే — నేను - ప్రస్తుతమే నాకు తెలుసును - భవిష్యత్తు వుట్టనిది - అనవసరం — భూతం చచ్చినది - దానితో పనిలేదు —

నరేంద్రుడు

(ద్వారమువైపు నడచుచు) కాని తిలోత్తమా, భూతభవిష్యద్వర్తమానాలకి — అట్టే భేదంలేదుసుమా! ఒకదానితో ఒకటి కలసిపోయి అంతా వర్తమానమే! (సేవకునితో) టీ తీసికొనిరండి.

నరేంద్రుడు

(తిరిగివచ్చి కూర్చుండును)

తిలోత్తమ

(సిగరెట్టుపొగను ఊదుచూ దానిని చూచుచు) ఎంతమంది నన్ను చూచి ముగ్ధులైనా, ఆవిషయం తెలిసి నాకు మనస్సులో గర్వం ఉన్నా, వీళ్ల పశుత్వానికి నాకు వీళ్లపై సాధారణంగా ఒక విధమైన విసుగు హీనభావం పుడుతుంది —

(సేవకుడు టీ సామగ్రి తెచ్చి తిలోత్తమ దగ్గరనుంచి వెడలును)

వాగనుశాసనుడు

వేడిగా ఉంది (లేచి కిటికీ తీసి కూర్చుండును)

తిలోత్తమ

(టీ పోయుచు) నా వివాహం కొఱకు నా యౌవనం కొఱకు నేను ఎంతమందితోనో ఆడాను — కాని సాధారణంగా వీళ్లందరు వట్టి చేతపెయ్యాలని నాకు తెలుసును — గుడ్డ గూబలు, మర బొమ్మలు — (టీ అందిచ్చును) నాకు వాళ్ళంటే ఒకవిధమైన అసహ్యం.

(నరేంద్రుడు వాగనుశాసనుడు స్వీకరింతురు — వాగనుశాసనుడు ఇతర తినుబండారములనుకూడ స్వీకరించును — కూర్చుండురు)

(నిశ్శబ్దము, అందరు త్రాగుచుందురు)

తిలోత్తమ

చకుముకీ — క్షమించండి, వాగనుశాస —

వాగనుశాసనుడు

అలా కాదు — చకుముకీ — అది చాలా మంచి పేరు — న్యూ_లు రోజులలో చకుముకి అంటే చక్రవర్తి అన్నమాటే.

(అందరు నవ్వుదురు)

తిలోత్తమ

చకుముకి అనే పేరు పెద్దది — చకీ అని పిలవనా ?

వాగనుశాసనుడు

నలుగురిలో మట్టుకు చటా అని మాత్రం వినబడ నివ్వకు —

(అందరు నవ్వుదురు)

నరేంద్రుడు

చకుముకీ! తిలోత్తమ పాటలు విన్నావా?

వాగనుశాసనుడు

చెవులున్నాయి కాబట్టి వినక తప్పిందికాదు.

తిలోత్తమ

చెవులున్న వాళ్ళందరూ వింటారా? కళ్ళున్న గ్రుడ్డివాళ్లెందరో! — గుండె ఉన్నా హృదయం లేనివాళ్లు లేరా!

నరేంద్రుడు

తిలోత్తమా, చకుముకిపై నీకెటువంటి అభిప్రాయం?

తిలోత్తమ

తెలివైనవాడే కాని వట్టి పురుగని నా అభిప్రాయం — ఇలాంటివాళ్లీ ప్రపంచం అంతా నిండి ఉన్నారు —

నరేంద్రుడు

వాగనుశాసనుడు పురుగా — ఊఁ — నిందాస్తుతులు సమానం — గీతోపదేశం.

తిలోత్తమ

క్షమించాలి, మీమీద ఇష్టం ఎలా లేదో కోపంకూడా అలా లేదు. సత్యం చెపుతుంటే ఎన్నో చిక్కులు —

నరేంద్రుడు

సహజత్వంలో, సత్యంలో, మానవత్వం ప్రకాశిస్తుంది.

తిలోత్తమ

చూడండి. నేను, దివ్యసుందరిని — ఐనా హృదయంలో

పాషాణం — ఎంతోమందిని ఇలా నవ్వి, కనుగీటి కొంతసేపు ఆడి పారవేశాను. అందరినీ నమ్మించి ఎవ్వరినీ నమ్మలేను — పతితను, కులటను — వీధులవెంబడి తిరిగే స్థితి వచ్చేటప్పటికి నరేంద్రుడు నన్ను తీసుకవచ్చి రక్షించేడు.

(కంటి నీటిని అద్దుకొనును)

నరేంద్రుడు

తిలోత్తమా అలా అనకు — అందరమును అలాంటివాళ్లమే సాధారణంగా — నేను ఎంత పతితుడనో నీకు తెలుసునా?

(తిలోత్తమ, నాగసుధాసనుడు అతనిని చూతురు ఆశ్చర్యముతో)

తిలోత్తమ

మమ్మల్ని ఉత్తమమానవులుగా చేసే శక్తి కూడా పతితుడా?

నరేంద్రుడు

నేచేసేది లేదు. — మీలో ఉన్నది బయటకు తీసికొని రావటంలో నాయత్నం — అదికాకుండా పతితుడే ఇటువంటి విషయాలని బాగా గ్రహిస్తాడు, మీ అభివృద్ధే నా అభివృద్ధి విన్నావా!

తిలోత్తమ

నేను మీరటువంటివారనుకోలేదు —

నరేంద్రుడు

కొద్దికాలము క్రితము కొన్ని మార్పులు వచ్చినంత మాత్రాన్ని నేనుకూడా నీవంటి జన్మమునే చాలారోజులు

బ్రతికాననే విషయాన్ని మరువలేను — భేదముండవచ్చును — అదియొక విషయముకాదు,

తిలోత్తమ

నేను స్త్రీని — అందుచే పతితను — పురుషులు వారికేం! వారు స్త్రీలుకారే —

నరేంద్రుడు

తిలోత్తమా! పిచ్చి మనుష్యుల పిచ్చిమాటలకి అర్థంలేదు— నీవు పతితవెట్లా ఐనావు?

తిలోత్తమ

నా ఇచ్ఛకొరకే కాకుండా, నా శరీరాన్ని ధనంకొరకు కూడా అమ్మేను — నేను పతితనుకానూ?

నరేంద్రుడు

అది విచారకరము. అంతేకాని వేరుకాదేమో!

తిలోత్తమ

నరేంద్రా — నా హృదయాన్ని పలికేవు — బుద్ధి ఉపయోగించి కొందరు, శరీరమును ఇతరుల సేవలో అలయబెట్టి కొందరు, చాలావరకు అందరు ఏదోవిధంగా, ఇతరులకొరకు తమస్వేచ్ఛను చంపుకొని జీవపోషణ జేసుకొన్నట్లే, నేనుకూడా నాశరీరంద్వారా, ఆకలిబాధ తీర్చుకునే యత్నంచేసేను — వారు ఎంత పతితులో నేను అంతే — కాని సంఘం అది హర్షిస్తుంది. ఇది హర్షించదు. —

నరేంద్రుడు

సత్యం, ఐనా దానిలో సౌందర్యం లేదు — ఆత్మను అమ్ముకోటంలో మానవత్వం నశించి పోతుంది — అందులో ప్రేమకు దివ్యస్థానమైన హృదయం —

తిలోత్తమ

ప్రేమ, భ్రమ — తాత్కాలికమైన ఒక హృదయస్థితి — అంతే — నాకు ప్రేమయందు నమ్మకం పోయింది. అది చాలా వరకు శారీరకమైంది కూడాను.

నరేంద్రుడు

నాకు నమ్మకం పోయింది కానీ, తిరిగి వచ్చింది.

వాగనుశాసనుడు

అదే ఇంత కొంపతీసింది. —

తిలోత్తమ

ఏం ?

వాగనుశాసనుడు

లేకపోతే ఈ వైరాగ్యం, ఈ వింత భావాలతో నరేంద్రుడు తన జీవితాన్ని ఈ విధంగా పాడుచేసుకోడు.

నరేంద్రుడు

చకుముకి వేదాంతమునకు ఆయనే భాష్యంరాయాలి —

వాగనుశాసనుడు

అదికాదు — మీ కీ వింత భావాలు లేకపోతే మీరింకా ఎటువంటి గొప్పగొప్ప పనులు చేసి ఉందురో ! దేశ దౌర్భాగ్యం ఈ మీ ప్రేమ బాధ.

నరేంద్రుడు

చకుముకీ! ప్రతిమానవుడు కొంత సహాయం చేయవచ్చును. కాని, ఎవ్వడు లేకపోయినా ప్రపంచానికి కొఱతలేదు —

తిలోత్తమ

గురువుని శిష్యురాలు ప్రశ్నింపవచ్చును.

నరేంద్రుడు

తప్పకుండా — అది కాకుండా అందఱూ విద్యార్థులే!

వాగనుశాసనుడు

నేను కొంచెం విహారానికి వెళ్ళవచ్చునా?

నరేంద్రుడు

సరే — కాని, తిలోత్తమ దివ్య హృదయం నీకు కనిపించిందా కొంచెమైనా —

వాగనుశాసనుడు

ఇంత ధైర్యంగా మాట్లాడేవ్యక్తి ఉంటుందని నేను అనుకో లేదు — ఇక ఆమె నాకు చెల్లెలు.

నరేంద్రుడు

సంతోషము.

తిలోత్తమ

(నరేంద్రుని చూచుచుండును)

వాగనుశాసనుడు

(నిష్క్రమించును) (నరేంద్రుడుగంటకొట్టును) (సేవకుడు ప్రవేశించును)

నరేంద్రుడు

తీసుకొని వెళ్ళవచ్చును.

సేవకుడు

చిత్తము (అట్లుచేయును, నిష్క్రమించును)

నరేంద్రుడు

(సిగరెట్టు నా పెకు నిచ్చును) (ఇరువురు అంటించుదురు)

నరేంద్రుడు

తిలోత్తమా! నీ సందేహం ఏమిటి?

తిలోత్తమ

మీకు హృదయం లేదనుకొన్నాను. ఇప్పుడు హృదయం ఉన్నదని విని అది ఎలాంటిదో తెలుసుకోవాలని ఉన్నది.

నరేంద్రుడు

(నవ్వి) హృదయంలేదని ఎలా అనుకొన్నావు?

తిలోత్తమ

(అతనిని చూచుచు) నిజము చెప్పనా, హృదయం కలవాడవైతే నారూపానికి ముగ్ధుడే ఐపోవు! — ఇంతయైన కరగలేదే!

నరేంద్రుడు

లేదు నిజమే! — కాని నా జీవితంలో నే పొందిన హృదయావస్థలు, నే చేసిన పనులు గ్రహించకుండా హృదయం లేదని అనుకోవటం కొంత సాహసం ఏమో!

తిలోత్తమ

హృదయం ఉంటే నా మూర్తికి కరగవద్దా —

నరేంద్రుడు

నీవు మహా సౌందర్యవతివి కావచ్చును. కాని ప్రతి హృదయాన్ని వశ్యం చేసుకోగలననే భావం కొంత అహంభావాన్ని సూచిస్తుంది. ప్రపంచంలో నిన్ను మించిన సౌందర్యవతులు లేరని అనుకోవటం న్యాయమా ! —

తిలోత్తమ

నీ హృదయ చరిత్ర కొంచెం చెప్తావా, అదే నాకు కావలసిన చరిత్ర. మిగిలిన చరిత్ర నాకు అనవసరం.

నరేంద్రుడు

చాలాకాలం నా హృదయాన్ని సంపూర్తిగ అర్పించే స్త్రీకొఱకు వేచేను. కాని లాభం లేకపోతే అది ఒక అసంభవమైన కల అనుకొని, తుమ్మెదలాగ లెక్కలేనన్ని పుష్పాలని ఆఘ్రాణించేను. సాధారణంగా పుష్పాలే నన్ను వెదకుతూ వచ్చాయి. ఆ పుష్పాలని స్వీకరించి ఆకాశంలో పెట్టి ఆడి పొంద గలిగినంత పొంది —

తిలోత్తమ

తిరిగి పాతాళలోకాన్ని పారవేసేవాడవు.

నరేంద్రుడు

ఔను —

తిలోత్తమ

ధర్మమా !

నరేంద్రుడు

కాదు — కానివాళ్ళెవరు ఆకాశంలో ఉండవలసిన దేవతలు కారు. నా అభీష్టములకు ఆడవచ్చినవారితో ఆడుకొన్నాను.

తిలోత్తమ

క్రూరత్వం అంటే ఏమిటి?

నరేంద్రుడు

అదే కావచ్చు — తప్పే — ఐనా మనుష్యుణ్ణి, దేవు డను కోను — అందుచే పతితుడనని ఒప్పుకోటంలో సంకోచించను.

తిలోత్తమ

ఆ ఆట ఎందుకు మానేవు?

నరేంద్రుడు

ఆ ఆటలకు విసిగిపోయేను. నాకు సంపూర్ణమైన తృప్తి వారెవ్వరూ ఇవ్వలేకపోయేరు. ప్రేమతత్వం ఎప్పటిలాగ కలలోనే ఉండి పోయింది — కాని ఆ ఆట మానివేయడానికి నిజమైన కారణం, ఒక అపూర్వం ఐన దివ్యసుందరి ఒక నిమిషంలో నన్ను తనకు దాసునిగా చేసుకొని నిజమైన ప్రేమను నాలో వెలిగించి ఆరిపేయ వీలులేనంతటి దివ్యజ్యోతిని నాలో పుట్టించింది — అదియే నా పూర్వపు ఆటలపై ఏవగి గలిగించింది.

తిలోత్తమ

ఆ స్త్రీని కలుసుకొన్నారా?

నరేంద్రుడు

మాట్లాడనైనా లేదు — ఒక్కటే చూపు — ఆమెదీ, నాదీ, అంతే — ఆపైన చూపైనా లేదు —

తిలోత్తమ

ఇది పిచ్చి, ప్రేమకాదు—

నరేంద్రుడు

నా భావానికి నీఇష్టంవచ్చిన పేరును పెట్టవచ్చు — కాని భావం సత్యం —

తిలోత్తమ

నేడు సత్యం — రేపు అసత్యం ప్రపంచంలో —

నరేంద్రుడు

ఔను, కాని నేడు, రేపు, ఎల్లుండి కూడా సత్యం ఐనవి కొన్ని ఉన్నాయి.

తిలోత్తమ

నీ ఈ పిచ్చిభావానికి అంతం లేదా !

నరేంద్రుడు

లేదు, చావుకూడా దానికి అంతాన్ని తీసుకురాలేదు.

తిలోత్తమ

నాకు అర్థంకాదు —

నరేంద్రుడు

నాకూ అర్థంకాదు — ప్రపంచంలోని అసాధారణ వస్తువు లేవీ మనకు అర్థంకావు —

తిలోత్తమ

చూడు — నిన్ను నేను గాఢంగా ప్రేమిస్తున్నాను. ఇది వఱకు ఎవ్వరిని ప్రేమించనంత ప్రేమిస్తున్నాను. లేని దాని కొరకై పిచ్చిభ్రమ మాను. నా ఆనందలహరిలో తేలిపో.

నరేంద్రుడు

తిలోత్తమా నీకు నాపై ఇటువంటి భావం ఉన్నదని అనుకోలేదు —

తిలోత్తమ

నాకు హృదయం ఉన్నది. తప్పేం!

నరేంద్రుడు

లేకపోవచ్చు — కాని నేను ఎవ్వరికి నా ప్రేమని ఇవ్వలేను — ఆ ప్రేమ ఆ కలలోని ఆమెకొఱకే —

తిలోత్తమ

ఆమెను నీవు చూడనే చూడవేమో!

నరేంద్రుడు

బహుశః చూడనే చూడను ఈ లోకంలో —

తిలోత్తమ

అప్పుడు?

నరేంద్రుడు

ఏం? — ఎన్నిలోకాలు లేవు — కాలం అనంతం —

తిలోత్తమ

ఎక్కడైనా కలుసుకొంటానని ధైర్యం ఎలా?

నరేంద్రుడు

ఆమెను ప్రేమించటంవే నా స్వభావం — ఆమె నన్ను ప్రేమించకపోయినా, నన్ను ఏలోకాన్నైనా కలవక పోయినా, భావం మారదు —

తిలోత్తమ

ఆమెకొఱకు యత్నించలేదు ?

నరేంద్రుడు

చేసేను — పేరుకూడా తెలియలేదు —

తిలోత్తమ

పోనీ, మళ్ళీ ప్రార్థిస్తున్నాను — కొంచెంఐనా నాకు నీప్రేమని ఇయ్యవూ ? శరీరసౌఖ్యం సత్యం ఐందికూడాను, అందులో తప్పులేదే !

నరేంద్రుడు

క్షమించు — ఇవ్వలేను —

తిలోత్తమ

అంతేనా వలచి వచ్చిన కాంతను — కొంచెం హృదయం, కొంచెం శరీరం —

నరేంద్రుడు

అంతే, నాహృదయం సంపూర్తిగ పరాధీనం —

తిలోత్తమ

సెహబాస్—నాకు దుఃఖం, నీకు దుఃఖం—నీ ప్రేమగొప్పది — నాప్రేమ అంతకన్నా గొప్పది — ప్రేమ అంటే నమస్కారం

లేనిదాన్ని. నేటినుండే నిన్నే వలచి, నీ ప్రేమకు ఆశింపక, జీవించివేస్తాను. కాలం దొర్లిపోతుంది — నిన్ను చూడటంవే ఆనందం. నీ సన్నిధే స్వర్గం — కాని ఈ విషయం నీవు ఇంక జ్ఞాపకం చేసుకోవలసిన అవసరమైనా ఉండదు — ఇది శపథం —

నరేంద్రుడు

అంత వద్దు — ఎందుకు, ఏమి లాభం!

తిలోత్తమ

లాభం ఉన్నదనే నువ్వు చేస్తున్నావా? నేను కులటనైనా, ప్రపంచం అదరిపోయేటట్లు, ప్రేమించని నిన్ను ప్రేమిస్తుంటా!— చావు ఎప్పుడో ఒకసారి వస్తుందికదా? దానికోసం ఎదురు చూస్తూ—

నరేంద్రుడు

చావాలంటే చావగలమా! —

తిలోత్తమ

చావాలంటే చావగలము, మన చేతులో ఉంది.

నరేంద్రుడు

అది పిరికిపని ఏమో.

తిలోత్తమ

మహా ధైర్యంఐన పని — అనవసరంగా బాధ పడటం ఎందుకూ — కాని ప్రాణం పోయినంత మాత్రాన్ని బాధ పోతుందా అనే శంక ఆత్మహత్యని కొంచెందూరంగా తోస్తుంటది.

నరేంద్రుడు

(మౌనస్సు)

తిలోత్తమ

విను — నా నిశ్చయం ఐపోయింది — కొంత వఱకు — ఆ పైన నాకు తెలియదు — గురువుని శిష్యురాలు మించినది, నీకు ఆశ ఉన్నది — నాకు సంప్రాప్తి ఐన నిరాశ—

నరేంద్రుడు

తిలోత్తమా, నీసాహసానికి కంపిస్తున్నాను —

తిలోత్తమ

నీ కంపంతో నాకేమి సంబంధం —

నరేంద్రుడు

నీకు నా నమస్కారం.

తిలోత్తమ

(వికటమైన నవ్వు) — అదే అవసరంలేదు.

నరేంద్రుడు

(లేచి) తిలోత్తమా ? కొంచెం విహారానికి వెళ్ళి వస్తావా!

తిలోత్తమ

నాకు కొంచెం తల తిరుగుతోంది — నిద్రపోవాలని ఉంది — నిద్ర రాదు — డబ్బుల్బ్రాండీ తాగనా! మత్తెక్కి నిద్రపట్టవచ్చును —

నరేంద్రుడు

వద్దు, తిలోత్తమా! వద్దు — డబ్బు 'ఆస్ప్రిన్' తీసికో.

వాగనుశాసనుడు

(వేగముతో ప్రవేశించి) — చూచారా! పేపరులో వంపడిందో!

తిలోత్తమ

(లేచి నిష్క్రమించుచు) సాధారణంగా ఉండే అర్థంలేని ఏదో అబద్ధపు తుక్కు ! (వెడలును)

నరేంద్రుడు

(పేపరు తీసికొని) ఏఁవని ?

వాగనుశాసనుడు

చూడు —

నరేంద్రుడు

(చదివి, పేపరు బల్లపై విసరి) నేను చెడ్డప్రవర్తనకలిగిన స్త్రీలను, పురుషులను చేరదీసి ఏదో చేయరాని పనులను చేయుచున్నట్లు సూచిస్తూ, మారుపేరుతో ఎవరో ఒకరు వింతవార్త క్రింద వ్రాయటం ! పేపరువారు దానికి అఖండమైన ప్రాముఖ్యం ఇవ్వటం — ! — ఊఁ — ప్రపంచం ! —

వాగనుశాసనుడు

నాకు చాలా కష్టంగాఉంది.

నరేంద్రుడు

కష్టం ఎందుకూ !

వాగనుశాసనుడు

నాకు నువ్వు ఇలాంటి శ్రమ తీసికోవటం ఎంత ఇష్టంలేక

పోయినా, మీ సదుద్దేశాన్ని ఈ విధంగా ప్రజలు గ్రహిస్తున్నారని చాల విచారం.

నరేంద్రుడు

పరవాలేదు — కాని ఎందుకు ఈయత్నం ఇష్టంలేదు నీకు — కొత్త సన్మానావలోకం ఇష్టంలేదు ? ఇంత క్రౌర్యం, అలజడి, కష్టంలేని భూలోకం ఇష్టంలేదు ?

వాగనుశాసనుడు

ఇష్టమేకాని — ఎంత శ్రమతీసికొన్నా, మానవత్వాన్ని మార్చటం కష్టం !

నరేంద్రుడు

మార్చాలి, మార్చాలి — తప్పదు.

వాగనుశాసనుడు

కాని నరేంద్రా " వెనుకటిగుణమేల మాను వినురానుమతీ " అన్నట్లు ఎలా మారుతుంది ? — కుక్కలు ! మానవులు కుక్కలు సర్ !

నరేంద్రుడు

కాని వాళ్ళలో దివ్యజ్యోతి ఒకమూల ప్రకాశిస్తున్నది.

వాగనుశాసనుడు

వల్లకాదు సర్ — ఏంపీలేదు —

నరేంద్రుడు

నేను ఒప్పుకోను.

వాగనుశాసనుడు

సరేకాని, ఒక మనవి. మనకున్నా ఈ బృందాన్ని పంపించన్నా పంపించి వేయండి — పీడ వదలుతుంది.

నరేంద్రుడు

అసంభవం — వారందరికీ నా మీద ప్రేమ — నన్ను నమ్ముకొని ఉన్నారు — ఎంతో అభివృద్ధికూడా పొందేరు — వీళ్లేదు.

వాగనుశాసనుడు

ఐతే — పర్వతాలపైనున్న, మన ఆ గృహానికి మార్చి వేయండి. ప్రస్తుతం — జనులమాటలు వినలేక పోతున్నా — అదికాకుండా శాంతిలేకుండా చేస్తున్నారు జనులు ఇల్లుచుట్టూ మూగిచూస్తూ — నా ప్రార్థన ఆలకించాలి.

నరేంద్రుడు

(ఆలోచించి) సరే — ఏర్పాటులు చేయించు.

(తెరపడును)

# "తీరని కోరిక - తరువాత"

## తృతీయాంకము

•••○○○•••

### మరియొక సంవత్సరము పిదప

(ప్రదేశము) — పర్వతముల మధ్యనున్న నరేంద్రుని గృహము. మిద్దెపై

(ప్రవేశము) - వాసంతి కూర్చుని కుట్టుకొనుచు. తరువాత వాగనుశాస నుడు సిగారు కాల్చుచు,

వాగనుశాసనుడు

డామ్‌గుడ్‌లైఫ్, డామ్‌గుడ్! — (తిరుగుచు) — మొత్తంమీద చాలా బాగాఉంది — నాకేం కావాలి ఇంక —!— కాని పాపం నరేంద్రుడు చాలా చిక్కులోపడి పోతాడేమో! ఎంత చెప్పినా వినడు. ఈ వ్యాయామన్ ఫ్రూల్సుతో ఎందుకు ఈ గొడవ! — ఒకళ్ళా ఇద్దరా! ఒక పెద్ద ఆశ్రమం ఐపోయింది — సర్కారు కూడా వేరేగా అనుమానిస్తున్నారట — తరువాత ఏఁపీలేండే ఇతని శీలాన్నిగూర్చి వదంతులు — వెధవలు — (వాసంతిని చూచి పెల్లగా) వెరీగుడ్, వెరీగుడ్, సువర్బ్! — (సమీపించి) వాసంతీ!

వాసంతి

ఏం తిలోత్తమను గురించి ఆలోచించటం ఐందా! — ఎందుకీ ఏడుపు! — ఆమె నిన్ను పురుగులా తుడిచి వేస్తదికదా! నువ్వు అనేవాడవే ఉన్నావని తలచనైనా తలచదు కదా? ఎందుకీ పాడాపుడీ!

వాగనుశాసనుడు

వాసంతీ — చాల అన్యాయం — నేను ఆమెనుగురించి ఆలోచించటంవేంలేదు — నేను సాధారణంగా ఇలాంటి విషయాలలో నా మెదడుని పాడుచేసుకోను —

వాసంతి

నీ అబద్ధాలకేంలే —

వాగనుశాసనుడు

చూడు ఈమధ్య అబద్ధాలు చెప్పే వాడుక పోయింది — అవసరంకూడా కనిపించటం లేదు — అదికాకుండా వాసంతీ, అబద్ధం ఏవిఁటి, నిజమేమిటి! ఇవ్వాళ నిజం, రేపు అబద్ధం, నేడు నిజం, రేపు అబద్ధం ప్రోగ్రెస్ అంటేనే అది —

వాసంతి

ఏడ్చినట్లుంది —

వాగనుశాసనుడు

(మనసులో) నువ్వా, (బహిరంగముగ) చాలా చలోక్తిగా అన్నావే — చూడు. (దగ్గరకు వచ్చి) నీకు చాలా అసూయ ఎక్కువ — (చిఱునవ్వు)

వాసంతి

కాదా, ఒకవైపు తిలోత్తమపై కన్ను, ఇంకోవైపు కొత్తగావచ్చిన సుమంగళిపై కన్ను, తుడిచేదానిపై కన్ను, పాకీదానిపై కన్ను —

వాగనుశాసనుడు

రామ రామ — వట్టి అన్యాయం (మనసులో) బాగా కని పట్టింది అసాధ్యం ముండ — ఎన్నిమాట్లన్నా తిలోత్తమని చూస్తే ఉబలాటఁవేఁ — సుమంగళిని చూచినా అంతే — వడుచు వాళ్ళని చూస్తేనే అంత — ఏం తప్పు! — న్యాచురల్!

వాసంతి

ఏం ఊరుకొన్నాఁవేం!

వాగనుశాసనుడు

నీలాపనిందలకు కారణం ఏఁవిఁటా అని ఇన్ట్రోస్పెక్షన్ చేసుకుంటున్నా.

వాసంతి

వల్లకాడు.

వాగనుశాసనుడు

మాట వరుసకి అంటున్నా — ప్రేమలో మట్టుకు కమ్యూనిజమ్ ఎందుకుండ గూడదూ?

వాసంతి

నా కది పనికిరాదు — ఇంత వటుకూ వచ్చేక నాకు అసూయకి కారణం ఎక్కువగా ఇచ్చేవంటే, జాగ్రత్త!

వాగనుశాసనుడు

(మనసులో) ముండ చంపదుకదా? — అందులో ఇది వటుకు మొగుడిని-చంపేసిన రాక్షసి — అనవసరంగా చిక్కులో పడ్డా

నేమో! — ప్రమాదో ధీమతామపి — (పైకి) (చిరునవ్వు) ఏదీ ఒక ముద్దుతో చంపివేయి.

వాసంతి

కత్తితో నరుకుతావా! నిజం —

వాగనుశాసనుడు

(కంగారును కప్పిపుచ్చ ప్రయత్నించును) (కొంచెము వెనుకకు జరుగును)

వాసంతి

(ఆలోచనతో) — కత్తి — హత్య — అబ్బా — వద్దు — అది ఇక చేయలేను — మఱచిపోలేను — రక్తం క్రాగిపోతుంది — అబ్బా — గుండెలో పోటు — మఱచిపోవాలి, మరచిపోవాలి — లేకపోతే చచ్చిపోయినా మఱచిపోవాలి — (కండ్లు మూసుకొనును)

వాగనుశాసనుడు

వాసంతీ — వెనుకటి చరిత్ర మఱచిపో.

వాసంతి

ఎలా మఱచిపోగలను — నాచేతిలో ఆ అసూయ భరించలేక నా భర్తని ఆ వేశ్యహస్తాల్లోనే అలా పొడిచివేయలేదూ? ఆ రక్తధార అదిగో ఇంకా ప్రవహిస్తోందే! — ఆ చచ్చిపోతున్నా అతని బాధ ఆ తేలిపోయే చూపు ఇంకా నన్ను చుట్టుకొని ఉన్నాయి —

వాగనుశాసనుడు

అలా అనవద్దు (సమీపించును)

వాసంతి

ఎలా అనకుండా ఉండను, ఏం చేయను — హంతకురా
నైనా, స్త్రీ హృదయం లేనిదాన్నికానే — బాధ — బాధ.
ఆవలేని బాధ —

వాగనుశాసనుడు

చూడు ! —

వాసంతి

ఏం చూడనూ ? రా నన్ను గట్టిగా కౌగలించుకో — ఈ
నరకబాధలో ప్రేమాలింగనం కావాలి — ఆ స్పర్శలో బా
మరచిపోవాలి ! — హత్య — బాధ — వలపు — !

వాగనుశాసనుడు

(వేగముగ కౌగలింపబోవ, సుమంగళి ప్రవేశించును. వాగనుశాసనుడ
తన ఉద్యమమును నిరాశతో విరమించును)

వాసంతి

సుమంగళీ వెళ్ళిపో, అడ్డురాకు.

సుమంగళి

(ఆశ్చర్యముతో) ఎవరికి అడ్డు ?

వాగనుశాసనుడు

(కంగారుతో) ఏమీ అడ్డులేదు (నెమ్మదిగా వాసంతితో) అంత
అడ్డే. న్యూసెన్సు.

వాసంతి

ఛా —

వాగనుశాసనుడు

(వినుపించనట్లు నటించును)

సుమంగళి

వాసంతీ, ఎందుకీ కోపం! శాంతించు!

వాసంతి

నువ్వు నాకు చెప్పటంవా — చంటిపిల్లని పారవేయటం కాదూ!

సుమంగళి

భర్తనుచంపినవాళ్లు చెప్పనక్కరలేదు!

వాగనుశాసనుడు

చాలా ఆశ్చర్యంగామారిందే!

వాసంతి

ఏ ఉద్రేకంచేత నేనలాచేసేనో నీకేం తెలుసు?

సుమంగళి

మరి నేను నాపిల్లని, కడుపార కన్నపిల్లని, ముద్దులొచ్చే పిల్లని ఎందుకు తడి ఆరకుండా విడిచిపెట్టేనో తెలుసునా! — నా కడుపు ఎలా తరుక్కుపోతోందో తెలుసునా! — పెళ్ళి కాకుండా కంటే యీ అమ్మలక్కలు ఈ పెద్దమనుష్యులు బ్రతకనివ్వరని, సంఘానికి భయపడి, మాతృత్వాన్నే చంపుకున్నంత పనిచేసి, దేవుడే దిక్కని పిల్లని అడవిలో విడిచిపెట్టేను —

వాగనుశాసనుడు

ఇలాంటి మాటలెందుకు అనటం, వినటంకూడా కష్టం!

సుమంగళి

అబ్బే సంఘం అలా అనుకోలేదు. ఎలాగో తెలిసింది. అనుమానంమీద నన్ను వెలేసేరు. వాళ్ళకోసం వాళ్ళవలన చేసిన పనికి బాగా ఫలితం! — నన్ను పెళ్ళి చేసుకుంటానని చెప్పి మోసగించిన మా బావకి ఏఁవీఁలేదు — సుఖంగా ఉన్నాడు.

వాసంతి

చాల అన్యాయం! అనవసరంగా నిన్ను ఉద్రేకంచేత బాధ పెట్టేను క్షమించు.

సుమంగళి

పరవాలేదు — బాధపట్టం అలవాటై పోయింది — (కంటినీరు)

వాసంతి

(లేచి ఆమెను చేరి, బుజ్జగించును) ఊరుకో అమ్మ — చిన్నపిల్లవు పాపం బాధపడ్డావు. పూర్వపుసంగతి మఱచిపో, ప్రస్తుతం ముఖ్యం ఐందని, భవిష్యత్తును తొంగిచూడాలని మనలోనున్న చెడ్డగురించి ఆలోచించవద్దని, మంచినే ఆలోచించి దానికి అనుగుణంగా స్వభావికంగా వర్తించమని, దానిలో మనకు సుఖం ఉందని మనకు బోధ కాదు!

వాగనుశాసనుడు

(తనలో) ఇతరులకి చెప్పటం తేలిక.

(నరేంద్రుడు ఒక పల్లెటూరి అచ్చమ్మతో ప్రవేశించును)

(తిలోత్తమ మరియొక వైపునుంచి ముసుగువైచుకొని ఘటోత్కచునితో ప్రవేశించును)

తిలోత్తమ

నరేంద్రా ! ఘటోత్కచుడు ఇతడు.

నరేంద్రుడు

(చిరునవ్వుతో) అయ్యా! సంతోషం — కూర్చోండి.

ఘటోత్కచుడు

అయ్యా ఈ తల్లి ఋణం ఏలా తీర్చుకోగలను — !

నరేంద్రుడు

(చిరునవ్వుతో) ఏం ! —

ఘటోత్కచుడు

(సంకోచించును)

నరేంద్రుడు

సందేహంవద్దు. ఇచట దాపరికంలేదు.

ఘటోత్కచుడు

నన్ను ఖయిదులోనించి తప్పించింది ఈ తల్లి (సిగ్గునొందును)

నరేంద్రుడు

సిగ్గువద్దు — మనకు రోగం వస్తే వచ్చిందని చెప్పుకోటానికి సిగ్గెందుకు. అలాంటివే మనం మనల్ని తెలుసుకోకుండా కొన్ని చేయరాని పనులు రోగంనుండి బాగుపడినట్లే. ఇలాంటి జబ్బుల నుండికూడా బాగుపడతాం !

ఘటోత్కచుడు

అయ్యా — చేసిన పని చెప్పితే తప్పేం ! —

నరేంద్రుడు

నిజం — ఇంకో మాట, మన అందరికీకూడా ఆట్టే భేదం లేదు — కాలాన్నిబట్టి, సంస్థలనిబట్టి, సన్నివేశాన్నిబట్టి, వేరు వేరుగా కనిపిస్తాం! — అంతే —

అచ్చమ్మ

అందఱం ఒకలే వీలా ఔతాం! ఓరయ్యో!

(నరేంద్రుడు, తిలోత్తమా తప్ప అందఱు నవ్వుదురు)

వాగనుశాసనుడు

భళీ!

నరేంద్రుడు

నవ్వట అనవసరం — అమాయకమైన పిల్ల, స్వచ్ఛమైన పిల్ల, పల్లెటూరిపిల్ల, ఏక విధంగా మన అందఱికన్నా నిజమైన పిల్ల — పాపం, విద్య పొందలేదు. అంతే —

అచ్చమ్మ

ఇదేంటయ్యో! ఈళ్ళంతా నిజంవై నోళ్లుకారేటో! — యంత్రంబొమ్మలో! — దెయ్యాలో! — ఓరన్నా మా ఊళ్ళో మాముసలమ్మ సచ్చిపోయినప్పుడు, ఓరాత్రి పాడుపడ్డ గాదివనక దెయ్యాల్ని సూశాను — నాకు దెయ్యం అంటే భయం అన్నో! —

నరేంద్రుడు

భయపడకు వీళ్లు మనుష్యులే! —

వాగనుశాసనుడు

(తనలో) చాలా బాగుంది పిల్ల — ఎంత పట్నాల్లో మెలిగినా, ఎన్ని రంగుబొమ్మల్ని, పౌడరుబొమ్మల్ని చూచినా పూర్వపు

రుచి మరచిపోలేం — పల్లెటూరు పడచుకున్న నవనవ, చావ మిగతావాళ్ళ కెలా ఒస్తాయి —

"నేచర్, సీనరీ" — పిక్చర్స్ — ఆ — నేచర్, అనేది ఇదే! —

సురేంద్రుడు

ఘటోత్కచా నీ చరిత్ర చెప్పు —

ఘటోత్కచుడు

అయ్యా! — ఈ తల్లి ఒక్కతే నడుస్తుంటే ఒక్క దెబ్బ కొట్టి, ఆమె చేతిని ఉన్న వజ్రాల ఉంగరం తీసికొని పారి పోయాను. — దుర్మార్గుణ్ణి, తల్లికి గాయం కలిగించేను —

(తిలోత్తమ కాళ్ళపైబడి ఏడ్చును)

తిలోత్తమ

(లేవదీసి) అబ్బే, చిన్న దెబ్బ! పరవాలేదు.

సురేంద్రుడు

(సమీపించి ముసుగుతీసి తలపైనున్న గాయమును చూచి)

అబ్బా పెద్ద దెబ్బ — డాక్టరుకి చూపించేవా?

తిలోత్తమ

ఆఁ! మందు వ్రాసేరు — పరవాలేదు.

ఘటోత్కచుడు

అయ్యా! వినాలి ఇంకా — దూరాన్ని ఉన్న పోలీసులు, పారిపోవటం చూచి నన్ను పట్టుకున్నారు — ఇంతలో ఈ తల్లి పడిపోయిన ఈ తల్లి లేచి మా వైపు వచ్చి వాళ్ళను, నన్ను

చూచి గ్రహించి, నాతో ఏమందో విన్నారా! — "నీకు నేను నా ఉంగరాన్ని ఇచ్చేసేను — నేను ముఖం తిరిగివడినంత మాత్రాన్ని ఎందుకు భయపడి పరిగెత్తేవు — ఎవరేమి అనుకుంటారు — అమ్మివేసికో బీదవాడిలాగఉన్నావు" అని. అంత పోలీసువాళ్లు నన్ను విడిచిపెట్టేరు.

(అందరు ఆశ్చర్యమును చూపుదురు)

నరేంద్రుడు

తిలోత్తమా, నీవు మహోత్తమురాలువని నాకు తెలుసును. మా అందరితరపునను, నీ మహోపదేశమునకు నమస్కరించు చున్నాను (నమస్కరించును)

తిలోత్తమ

గురూపదేశం (నమస్కారం)

నరేంద్రుడు

నీకుపదేశం ఏమిటి — నీకు నీవేగురువు.

అచ్చమ్మ

ఓ అమ్మా! ఇదేంసిత్రం — ఆణ్ణి సావమోదక.

ఘటోత్కచుడు

నిజం.

తిలోత్తమ

తప్పు — అతని ఆకలి అతనిని అలాచేయించి ఉండాలి.

అచ్చమ్మ

అదేం ఊసో! — ఆకలేస్తే దొంగతనంవే!

వాగనుశాసనుడు

చాలా పోయింటెడ్, చాలాబాగుంది.

తిలోత్తమ

చకుముకీ ఊరుకో.

నరేంద్రుడు

ఘటోత్కచా, ఎందుకు ఈపని చేసేవు? —

ఘటోత్కచుడు

బుద్ధిలేక, ఆ బుద్ధిలేనితనాన్ని లక్ష శిక్షలు కంటె ఈ తల్లి కరుణ మాడ్చివేసింది —

నరేంద్రుడు

నీ చరిత్ర! —

ఘటోత్కచుడు

*         *         *         *

వాగనుశాసనుడు

(వాసంతితో) దొంగవెధవకి చరిత్ర ఏఁవిఁటీ — వీడేఁవైనా మహాపురుషుడా!

వాసంతి

నోరుమూయ్!

ఘటోత్కచుడు

చరిత్రేఁవిటి అయ్యా! స్కాలర్‌షిప్పుమీద బియ్యే పాసయ్యేక నిరుద్యోగసమస్యలోపడి దిక్కులేక, ఏం చేయలేక, కాంగ్రెసులోచేరి, అందులో లాభంపొందలేక, కమ్యూనిష్టునై,

ఖైదులోపడి, విడిచిపెట్టబడి, దమ్మిడీలేక, ఆకలిబాధకు ఓర్వ లేక దొంగతనంలోకి దిగేను.

నరేంద్రుడు

అది తప్పని తోచలేదా !

ఘటోత్కచుడు

అయ్యో ముందు చాలా బాధపడ్డాను — కాని తరువాత అలవాటైపోయింది — ఒకవిధంగా సమాధానంకూడా చేసుకున్నాను —

నరేంద్రుడు

ఏమిటది.

ఘటోత్కచుడు

ప్రపంచం అంతా, దొంగతనమే కదా ! అని, నిజాన్ని కప్పిపుచ్చటం, భావాల్ని దాచటం, ఇతర్లని ఆకర్షించటం. తక్కువ ధరకు కొని ఎక్కువ ధరకు అమ్మటం, ఇతరులకు తెలియకుండా గమ్మత్తు చేయడం, ఏదోవిధంగా వన్నులు లాగటం, ఇవన్నీ కూడా దొంగతనమే అని — జైత్ర యాత్రకూడా దొంగతనం అని అనిపించింది — ఇన్ని పెద్ద దొంగతనాలు ఉండగా, ఆకలికోసం, ఒక చిన్న దొంగతనం, ఉదరపోషణకోసం చేస్తే తప్పా అని అనుకొన్నాను — ఆకలిబాధ, అబ్బా ఆకలిబాధ — అనుభవించినవాడికి తెలుస్తుంది — నరాలు చుట్టుకుపోతాయి, కళ్లు చీకట్లు కమ్ముతాయి, ఇదమిద్ధం అని, ధర్మాధర్మాలని తెలియవుకూడానూ ! —

## తృతీయాంకము

తిలోత్తమ

సంఘం తప్పుకాదే?

ఘటోత్కచుడు

కాని ఇప్పుడు ఈ తల్లి దయవల్ల ఒకటి తెలిసింది — నేను కష్టపడ్డా ఇతరులని కష్టపెట్టకూడదని.

నరేంద్రుడు

ధన్యుడవు. నీవు కొన్నాళ్లు ఇక్కడుండాలి.

ఘటోత్కచుడు

పొమ్మన్నా పోలేను —

వాగనుశాసనుడు

(తనలో) సంపూర్తిదొంగలు, హంతకులు, గుడిసేటివాళ్ళు — ఇక తాగుబోతులో — అరే, మర్చిపోయేను, ఐరనీ — నేను తాగుబోతుని కాకపోయినా! ఒకప్పుడు బాగానే తాగేవాడిని ఊరికే ఎవరైన ఇస్తేను — చాలా మంచి ఫీలింగు — దమ్మిడీ లేకపోయినా, కిన్గ్ ఎమ్పరర్‌లా ఫీలవవాడిని! — అది ఒక ఎక్స్పీరియన్సు.

నరేంద్రుడు

ఒక్క పెద్ద యత్నం, చేస్తున్నావు —

తిలోత్తమ

ఔను కాని విధి ఎట్లో? —

నరేంద్రుడు

ఐనా, మనుష్యశక్తి! —

తిలోత్తమ

మనుష్యశక్తి, — విధి! — దైవేచ్ఛ!

నరేంద్రుడు

మనుష్యశక్తి, — విధి! — దైవేచ్ఛ!

(తిలోత్తమ, నరేంద్రుడు నిష్క్రమింతురు)

వాగనుశాసనుడు

కామన్సెన్సు, ఫ్రూడెన్సు, యుటిలిటీ! —

అచ్చమ్మ

ఇక్కడా చాలా కంగారుగా ఉందే —

వాగనుశాసనుడు

ముందు అలాగే ఉంటుంది, క్రమంగా అలవాటైతే చాలా బాగా ఉంటుంది.

వాసంతి

చదువు చాలు!

వాగనుశాసనుడు

(మాట మార్చి) కొంచెం నడిచి షికారు వెళ్లుదాంవా వాసంతీ!

వాసంతి

రా! (తేచును)

సుమంగళి

(అచ్చమ్మతో) నువ్వెందుకొచ్చావు? —

అచ్చమ్మ

నీ కెందుకమ్మా!

వాగనుశాసనుడు

చెప్పు పరవాలేదు.

అచ్చమ్మ

మా ఇంటోడు, ఏం పాపం చెయ్యం దాన్ని నన్ను పువ్వులు పెట్టుకోంటే, తెల్లకోక కట్టుకోంటే, అనుమానంతో చావ గొట్టేసేవోడు — ఓటమ్మా ఈగోలేంటని, అతగాడి ఇంట్లోంచి పారిపోతే, అమ్మలక్కలు లేచిపోయిందని ఎలిసేలు — ఈ మారాజు విని నన్ను ఈడకి తీసికొచ్చేరు —

సుమంగళి

పాపం ఎంతబాధ పడ్డావో !

వాగనుశాసనుడు

పువ్వులు వగైరాలు ధరించటంవల్ల కొట్టటం తప్పైనా, కొట్టటం అనేది ఒకటి తప్పకుండా ఉండాలి, లేకపోతే ఆడవాళ్లు అసలు మాటవింటారా (చిరునవ్వు)

వాసంతి

ఏం చెప్తున్నావు ?

వాగనుశాసనుడు

(కొంచం వెనుకకుతగ్గి) చలోక్తి (చిరునవ్వు)

వాసంతి

చాలు రా ! (ఇరువురు నిష్క్రమింపబోదురు)

అచ్చమ్మ

ఈ అయ్యగారితలకి ఆ అమ్మోరుసరి !

(ఒక పిచ్చివాడు మిద్దెకున్న పిట్టగోడమీదుగ ప్రవేశించును. వాగను శాసనాదులాగి ఆశ్చర్యముతో చూతురు. పిచ్చివాడు వారి నాశ్చర్యముతో చూచును)

వాగనుశాసనుడు

ఎవరు నీవు ? — ఎందుకొచ్చావు.

పిచ్చివాడు

ఎవరు నీవు ? — ఎందుకొచ్చావు.

వాగనుశాసనుడు

మతిలేనివాడా ! ఎలా వచ్చావు.

పిచ్చివాడు

మతిలేనివాడా ! ఎలా వచ్చావు.

వాసంతి

వీడెవడో పిచ్చివాడు — ఎలాగో ఎవ్వరూ చూడకుండా వచ్చేడు.

పిచ్చివాడు

హే హే హే ! బాగా కనిపెట్టేవు పిచ్చిముండా ! (వాగనుశాసనునిచూచి) నీకు దీనికి ఏం సంబంధంరా, జోడీగానుంచున్నారు! హే హే హే తెలుసునునాకు వెఱ్ఱిముండా కొడుకును కాను — నాకు కొన్నాళ్ళక్రితం మతిస్థిరంతగ్గిందని అనుమానం కలిగింది. తప్పు అభిప్రాయం. అప్పుడే మతిస్థిరం కుదిరింది. అంతకుముందే పిచ్చి — సరిగ్గా నేననుకొనే సమయానికి నలుగురూ నాకు పిచ్చెక్కిందనితో సేశారు పిచ్చాసుపత్రిలోనికి — వెఱ్ఱివెధవలు —

అచ్చమ్మనుచూచి) ఒక ముద్దిచ్చేసేయి — మరచిపోయాను ( సమీపింపబోవును)

అచ్చమ్మ

ఓలమ్మో ! వీడి పిచ్చి మాడ !

ఘటోత్కచుడు

ఆగు — (అడ్డువచ్చును)

పిచ్చివాడు

(ఆగి) నీకిది భార్య — ఐతే "సారీ" — లేక భార్యలాంటిదా ? ఐతే "నెవర్ మైండ్" — ఏఁవైతేనేం నాకు అవసరంలేదు — చూడు తమ్ముడూ సెక్సు అనేది చాలా "షేకీ తింగు" ఓయ్ ! —

వాసంతి

సుమంగళీ, అచ్చమ్మా రండి వెళ్ళిపోదాం — (వాగనుశాసనుని చూచి) వీనిని సాగనంపి వేగంగా రా !

వాగనుశాసనుడు

ఎందుకూ నేనూ ఇప్పుడే వచ్చేస్తా, పిచ్చివాళ్ళు అంత సేఫ్‌ఐన వాళ్ళు కారు —

వాసంతి

పిరికివాడా ! పంపించి మరి రా !

(స్త్రీలు నిష్క్రమింతురు)

వాగనుశాసనుడు

పిరికితనం ఏఁవిటీ ? సిల్లీ ! — (అని దూరంగా నిలుచుండును)

ఘటోత్కచుడు

వెళ్ళిపో, ఇక్కడికి రాకూడదూ !

పిచ్చివాడు

నువెవ్వడవీ చెప్పడానికి — ఒకడి ఆజ్ఞమీాదొస్తేగా ఒకడాజ్ఞ మీాద వెళ్ళనానికి ! — రెండూ సున్న — పిచ్చాసుపత్రినుంచి ఎవడితో చెప్పి వచ్చాను — అరే జ్ఞాపకం వచ్చింది ఇదంతా పిచ్చాసుపత్రి — మీారంతా పిచ్చోళ్ళా ఆ పెద్దాకాశం ఇనప పంజరం, ఆకొండల్లో ఉన్నవే ఇనప తలుపులు — ఆ దూరాన్ని వినిపిస్తున్నా గాలి హోరులాంటిది పిచ్చోళ్ళని చంపేసే విష వాయువు — హూహూం (ఏడ్చుచు) చావంటే భయం, భయం వేస్తుంది (ఒక్క గంతువేసి వాగనుశాసనుని కంఠాన్ని కౌగలించుకొనును.)

వాగనుశాసనుడు

(కేకలువేయుచు) రక్షించండి, రక్షించండి —

ఘటోత్కచుడు

(పిచ్చివాడిని గట్టిగా లాగివేయును)

పిచ్చివాడు

భయం పోయింది (గోడమీాదకూర్చుండును)

వాగనుశాసనుడు

కంగారుతో (నిష్క్రమించుచు) బంట్రోతుని తీసుకొస్తా (వెడలును)

పిచ్చివాడు

బంట్రోతు బడవని రానీయి, వాడి అమ్మ మొగుడు కానీయి — నాకేం — చూడు, వాడి అమ్మ మొగు డెవడో తెలుసునా ?

ఘటోత్కచుడు

(నవ్వుతో) ఎవడు ?

పిచ్చివాడు

వాడితండ్రి. హాహాహా !

ఘటోత్కచుడు

నీవింక వెళ్ళిపోవాలి.

పిచ్చివాడు

కాళ్ళు పట్టుకుంటా ! — ఐదునిముషాలు కూర్చుని తప్పు కుండా పోతా ! — ఆ బంట్రోతుని రావద్దను. వస్తే — ఒకోతు దూకు మిద్దెమీదనుండి — ఆ లోయలోపడి సచ్చిపోతా ! జాగ్రత్త — నే పిచ్చివాణ్ణేలే, ఆ సంగతి నాకు తెలుసును. అంచేత ఏంచేసినా చేసేస్తా. నాకు మతిలేదు. ఉహూం, మతిలేదు — ఎందు కీ బ్రతుకు ! దేవుడా, నీవే ఉంటే, మతి అన్నా ఇయ్యి, లేకపోతే నన్నన్నా తీసుకపో (ఏడ్చును).

ఘటోత్కచుడు

ఏడ్వకు — బాగానే వున్నావు —

(బంట్రోతు ప్రవేశింపబోవ వానితో) (అక్కరలేదు. వెడలిపో. నేను పంపించివేస్తా.) (బంట్రోతు నిష్క్రమించును.)

పిచ్చివాడు

చాలా ధన్యవాదాలు. నువ్వే పంపించు — ఆ— ఆ — ఏదో చెప్పేను — ఏదో చెప్పేను — ఏదో మరిచిపోయేను — పోనీయ్, అసలు చెప్పలేదనే సిద్ధాంతం ! అసలు సిదాంతిని, తరువాత వేదాంతిని — అబ్బే ముందే అది — తరువాత ఇది — బో — బో — అది ఇక్కడ ఇది అక్కడ — నానాకంగాళుగా

ఉందోయి — ఏదైతేనేం — ఇప్పుడు వెఱ్ఱివెధవని — (నవ్వును, ఏడ్చును)

ఘటోత్కచుడు

ఊరుకో.

పిచ్చివాడు

ఊరుకుంటా ! నీవు ఊరుకోమంటే ఊరుకోలేదు — నాకు మతిఉంది. మీ అందఱికి మతిలేదు ! ప్రూవుచేయనా.

ఘటోత్కచుడు

చేయి.

పిచ్చివాడు

ఇదిగో నాకు మతిలేదు — మతిలేదని నాకు తెలుసును — మీకు మతిలేదు — మీకు మతిలేదని మీకు తెలియదు— అంచేత మీకు మతిలేదు — భేష్, బాగు !

వాగనుశాసనుడు

(చాటునుండి) పంపించివేయవోయి, వాడితో నీకు ఇష్టాగోష్ఠి ఏమిటి ?

పిచ్చివాడు

ఇవతలికిరా ఏంజేస్తానో! — చూడవోయి నేస్తుడా, సూర్యుడు, చంద్రుడూ వంకరైపోయి, పోయి, పోయి, డేకుక్కుంటున్నారు — చుక్కలన్నీ రాలిపోతున్నాయి, అవకాశం తగ్గిపోతుంది, కాలం వెనక్కి పారిపోతుంది ; కొండ మీదకి ఉరుకుతుంది — చీకటి వెలుగు చావు బ్రతుకు ఒకటే కదంబం ! — నవ్వులు, ఏడ్పులు,

సంగీతం — వేదాంతం శృంగారం వెఱ్ఱిగంతులు —(గంతులువేయుచు) తధిగిణ_తై, తధిగిణ_తై — మధురానగరిలో — (పాడును) "మొగుడో పిలిచేను" — హో హో హో, మొగుడొచ్చి పిలిస్తే వెళ్ళాలా వెఱ్ఱిముండ ! — ఆ జ్ఞాపకం వచ్చినది — ఈ మధ్యనే ఎవడో వ్రాసేడు, మొగుడుజారుడైతే పెళ్ళాం రంకుతనం చేసింది — దానికి బంగారు పతకం బహుమానం ! ఏం అనుకున్నావూ !

ఘటోత్కచుడు

ఇంక రా వెళ్దాం. ఐదు నిమిషాలు ఐంది.

పిచ్చివాడు

ఏం ఐందోయి, ఏవీ అవ్వలేదు. వట్టి భ్రమ —

(నరేంద్రుడు తిలోత్తమ ప్రవేశింతురు)

పిచ్చివాడు

వాడేనోయి నన్ను పిచ్చిఆసుపత్రిలో చావగొట్టిన జమాను — స్వస్థి దీనితో నీ వెఱ్ఱిబతుకు స్వస్థి (చొక్కాలోనుండి కత్తితీసి, హరహర మహాదేవ శంభో ! అని నరేంద్రుని మీదికి గంతువేసి పోవును — తిలోత్తమ అడ్డముగవచ్చి నరేంద్రుని తనచేతులతో కప్పిరక్షించును — పిచ్చి వాని కత్తి తిలోత్తమ భుజము వెనుక లోతుగ గ్రుచ్చుకొనును — తిలోత్తమ పడిపోవును — నరేంద్రుడు కత్తినూడదీసి రక్తమునాపుచు ఆమెను లేవనెత్త ప్రయత్నించుచు, ఆమెశరీరమును తనతొడపై నుంచుకొనును. ఈలోన ఘటోత్కచుడు పిచ్చివానిపై నురకబోవ, పిచ్చివాడు తప్పించుకొని మిద్దెపైనుండి "హరహర మహాదేవ శంభో" అనుచు దూకును. ఘటోత్కచుడు మిద్దె చివరినుండి చూచి వచ్చులోపల "డాక్టర్" అను నరేంద్రుని కేకవిని పరుగెత్తును లోపలకు — వాగనుశాసనుడు వేగముగ ప్రవేశించును.)

కొంప మునిగినది అనుకొన్నా — చూచేను చాటునుంచి, భయంవేసి కంగారుచే పారిపోయేను. కొంచం, కాని వెంటనే వచ్చేను పిచ్చివాడిని పట్టుకోవాలని. వరహాంతకుడు పారి పోయాడు. అయ్యో అయ్యో! ఏంపిటిది తిలోత్తమే — పరవా లేదుకదా !

నరేంద్రుడు

త్వరగా ... వైద్యుడు ! గృహావైద్యుడు !

వాగనుశాసనుడు

ఇదిగో (పరుగెత్తును)

తిలోత్తమ

(మూసినకండ్లు తెఱచి నరేంద్రుని కాంచుచు ఆయాసముతో)
పరవాలేదు — (బాధనడచుకొనుచు) పరవాలేదు — నాకేమైనా పరవాలేదు నీకు గాయం తగలలేదుకదా.

నరేంద్రుడు

(గద్గదికతో) తిలోత్తమా! ఈనా పనికిమాలిన బ్రతుకుకు చావు రాదు — నాపై ఈగ ఐనా వాలనీయక నీ ప్రాణాలతో నన్ను రక్షించేవా ! — ఎందుకు, ఎందుకు, — ఎందుకీ ఘోరమైన మహోదారత్వం ! త్యాగం — (మాట్లాడలేక పోవును)

తిలోత్తమ

(చిరునవ్వుతో) త్యాగంకాదు — ప్రేమ — నీకొరకు కాదు, నా కొఱకు నా ప్రేమకొఱకు — అబ్బా — (బాధను సహించును)

నరేంద్రుడు

(రెండూ కంటిచుక్కలామె ముఖము పైపడును)

తిలోత్తమ

అమృతవర్షం — నరేంద్రా, వద్దు — దాహం — !

(వైద్యుడు, వాగనుశాసనుడు, ఘటోత్కచుడు ప్రవేశింతురు)

(వైద్యుడు నీరునిచ్చి పరీక్షచేసి, చికిత్సచేయును)

నరేంద్రుడు

అయ్యా పరవాలేదుకదా (వైద్యుని చెవిలో)

వైద్యుడు

(నెమ్మదిగ) దైవేచ్ఛ !

వాగనుశాసనుడు

(ఘటోత్కచునితో) ఏంవైనాడు ఆ పిచ్చిహంతకుడు !

ఘటోత్కచుడు

లోయలోపడి ముక్క ముక్కలైనాడు — చూడు ఎవరు రాకుండా జాగ్రత్తచేయాలి — ఆ తల్లికి విశ్రాంతి కావాలి — నా తల్లి — ఆమె బ్రతకాలి — లేకపోతే వీల్లేదు —

వాగనుశాసనుడు

ఎవ్వరు తాకుండా ఏర్పాటు చేస్తాను. (వెడలును)

వైద్యుడు

వెంటనే క్రొత్తరక్తం ఎక్కించాలి — ట్రాన్సుఫ్యూజన్ —

ఘటోత్కచుడు

నేను సిద్ధం. నారక్తం ఇస్తా —

తిలోత్తమ

వద్దు — వద్దు —

నరేంద్రుడు

తప్పదు —

తిలోత్తమ

పిల్లేమ - నీవునాకు సపర్య చేయాలి —

వైద్యుడు

మీరు బలహీనంగా ఉన్నారు — మీ రక్తం తీయ పిల్లేదు -

ఘటోత్కచుడు

అయ్యా రండి, నారక్తం —

తిలోత్తమ

అది వద్దు —

వైద్యుడు

రండి.

ఘటోత్కచుడు

త్వరగా !

(వైద్యుడు ఘటోత్కచుడు నిష్క్రమింతురు)

తిలోత్తమ

లాభంలేదేమో ! వ్యర్థం ఏమో !

నరేంద్రుడు

(ధైర్యమునటించుచు) లాభమున్నది — మనుష్య యత్నం — దైవానుగ్రహం —

తిలోత్తమ

విధి— దైవేచ్ఛ ! (కండ్లు మూసుకొనును)

వాగనుశాసనుడు

(ప్రవేశించి) నైగ్గాడు -ోపలకు తీసుకొని రమ్మంటున్నాడు — చెల్లీ లేవదీయనా !

తిలోత్తమ

వద్దు — ఇతరులు ఎవ్వరు ముట్టవద్దు — ఒక్క నరేంద్రుడే నన్ను తాకవలయును — ఎందు క్రీశమ !

నరేంద్రుడు

(ఆమెను లేవనెత్తి పోయును)

తిలోత్తమ

(నరేంద్రుని చూచుచు) చాలు ఈ ఒక్కక్షణమే చాలు — సార్థకం ఈ జన్మ (కండ్లు మూసుకొని) నరేంద్రా — కాలంఅనంతం, ఎన్నో లోకాలు — ఒకటే హృదయం — మరచిపోకు —

నరేంద్రుడు

హృదయ పూర్వకమైన దివ్య శపథం — అనంతకాలంలో ఎప్పటికిని మరవను.

తిలోత్తమ

(కండ్లు మూసికొనియే చిరునవ్వు)

(నరేంద్రుడు ఆమెతో వెడలును)

వాగనుశాసనుడు

నేనింక ఏడుపు ఆపుకోలేను —

(తె ర ప డు ను)

---

# "తీరని కోరిక - తరువాత"

## చతుర్థాంకము

ఆరునెలల పిదప

ప్రదేశము (పర్వతముల మధ్య—సానువులపై—ఒక చిన్నిగదివంటి పాక)

ప్రవేశము (గొర్రెలకాయుముసలివాడు)

గొర్రెలకాపరి

టిర్ ర్ప్ ప్ప్ — హాయ్ హాయి — (కర్రను ఊపును)

ఆ కొండ నీడొచ్చింది — గంజేళైంది (గొర్రెలకాపరులు వేయు కేక వేయును)

అచ్చమ్మ

(ప్రవేశించి) ఓ తాతా దాహం వేస్తోంది — దాహంఇస్తావా ?—

గొర్రెలకాపరి

హా (గుడిసెలోనుండి ముంత తెచ్చి నీరుపోయును — ఆమె త్రాగును. అతడు ముంత గుడిసెలో పెట్టివచ్చును —) ఏం అమ్మో ఈవేళ ఇలా ఒచ్చేవు ఒంటిగా — పొద్దుకుంకేస్తది !

అచ్చమ్మ

ఏం తాతా ఎంత పొద్దుందేంటి ?

గొర్రెలకాపరి

ఇంకెంత గంజేళైంది — ఓ జాఁ వటో ఇటో ! — జాగర్త — చీకటడిపోతది — బయల్దేరి పో, అమ్మో — నే పోతన్నా !

అచ్చమ్మ

ఎక్కడికి కెళ్తావో !

గొర్రెలకాపరి

మా ముసలి కనిపెట్టుకుంటది — ఆలొద్దిలో ఉంది మా గుడిసె — (చేతిని కంటికిచేర్చి చూచుచు) ఆఁ — అదిగో ఆ దూరాన్ని అగపడతంది —

అచ్చమ్మ

అక్కడ బాగా ఉంటదా తాతా !

గొర్రెలకాపరి

ఆఁ బాగానే ఉంటది —

అచ్చమ్మ

నా కలాంటి గూడు కావాలి — (పరధ్యానములో)

గొర్రెలకాపరి

నీ కిల్లు లేదమ్మా ?

అచ్చమ్మ

ఉందీ, లేదు.

గొర్రెలకాపరి

ఆదేంటి ?

అచ్చమ్మ

నీ కెందుకులే తాతా !

గొర్రెలకాపరి

పోతా ? — సలేస్తందికూడా (వణఁకుచు) ఓ అమ్మా నువ్వు కూడా వేగంగా పో, మబ్బులు కమ్మాసి వానవస్తే చీకట్లో

దారి తప్పుతావు — పులో పుట్రో డోవలో ఉండొచ్చు — షో అమ్మా, షో !

అచ్చమ్మ

అదిగో — అతగా డొస్తున్నాడు —

గౌరెలకావరి

(చూచి అసమ్మతిని తెలుపు తలయూపు నూపి గొణుకుకొనుచు) కాలం మారింది — వయస్సు కళ్లు ఒళ్లూ తెలియవ్ — కండకావరం — వయస్సు మళ్లాలి కుర్ర కుంకలికి — కలికాలం — అందుకే వంటల్లేవు — గౌరెలు ఉన్నట్టుండి ఏ పోలేరమ్మ నోటిలోనో పడిపోతుంటాయి — (దగ్గుచు, నిష్క్రమించును) (తెరలో టిర్ర్, ప్ప్ప్)

వాగనుశాసనుడు

(ప్రవేశించి) అచ్చమ్మా, చాలా సంతోషం.

అచ్చమ్మ

(చిరునవ్వు) ఇక్కడికి రమ్మని చెవులో చెప్పేం, పెద్ద సంగతన్నావు.

వాగనుశాసనుడు

ఆ చాలా గొప్పసంగతే — వింటావా !

అచ్చమ్మ

ఇంటాలే — సెప్పు.

వాగనుశాసనుడు

నీవు నన్ను పెళ్ళి సేసుకొంటావా ? — ఊ అనాలి —

అచ్చమ్మ

అనకపోతే —

వాగనుశాసనుడు

ఆ లోయలోదూకేస్తా.

అచ్చమ్మ

ఓరయ్యో! — అంతపనే —

వాగనుశాసనుడు

ఎంతపని అన్నా సేసేస్తా!

అచ్చమ్మ

అలా — (ఆలోచించి) — నువ్వంటే — ఉబ — లాటం ఉంది కాని, పెళ్ళంటే భయం యేస్తందోబావా!

వాగనుశాసనుడు

నీకేకాదు బుద్ధిమంతులందరికి ఆ విషయంఅంటే చాలా భయమే, ఐనా —

అచ్చమ్మ

ఐతే ఇంతమంది పెళ్లిళ్ళెందుకు సేసుకుంటారూ!

వాగనుశాసనుడు

బుద్ధిలేక — లేకపోతే విధిలేకో —

అచ్చమ్మ

నువ్వుకూడా ఆపనే సేస్తానంటూంవే, ఏంలేకేనా సేస్తానంటావు?

వాగనుశాసనుడు

అది వేరు, ఇతరుల విషయంకాని నా విషయం నీ విషయం
ఐ కాదు.

అచ్చమ్మ

ఏం బావా —

వాగనుశాసనుడు

బావనెలా అయ్యేను!

అచ్చమ్మ

(కోపంతో) బావకాకపోతే మొగుడెలా ఔతావనుకొన్నావు!

వాగనుశాసనుడు

ఔను, ఔను, కోపంవద్దు — తమాషాకన్నా —

అచ్చమ్మ

నా కిలాంటి తమాషాలు ఇష్టంలేదు —

వాగనుశాసనుడు

సరే — తప్పొచ్చింది — నా మాటకి ఊఁ అనవూ?

అచ్చమ్మ

(సిగ్గు నటించుచు) ఊరుమనువే.

వాగనుశాసనుడు

మీలో లేదూ?

అచ్చమ్మ

ఉండలే — సరే — ఊఁ కాని, కొడితేమాత్రం ఒప్పు
కోనుసుమా.

వాగనుశాసనుడు

నా అచ్చీ, ఇంకనుంచి నా అచ్చీ, నువ్వే నన్ను కొట్టు.

అచ్చమ్మ

తప్పుకాదూ !

వాగనుశాసనుడు

తప్పేవిఁటీ — నువ్వంటే నాకు ఒక దేవతవ్వూ ! — నిన్ను చూచిన దగ్గరనుంచీ ఇతరస్త్రీలంటే ఛా —

అచ్చమ్మ

మొగోళ్ళమాట లింతే బావా ! —

వాగనుశాసనుడు

నా అచ్చీ, అలాంటి మొగవాణ్ణికానే —

అచ్చమ్మ

ఇదేంటిబావా, మొగోడువు కావో !

వాగనుశాసనుడు

అచ్చీ దానికి సందేహం ఏఁవిఁటీ, అబద్ధాలు చెప్పేవాడిని కానన్నా.

అచ్చమ్మ

ఓయబ్బ ! గుండె నిబ్బరంపడింది.

వాగనుశాసనుడు

అచ్చీ, నీవు చాలా సెన్సిటివ్.

అచ్చమ్మ

సన్సినంటావేం ?

వాగనుశాసనుడు

అచ్చీ, అది ఇంగ్లీషుమాట — అంటే చాలా మృదువైన దాన వన్నమాట.

అచ్చమ్మ

ఓ బావో, ఈ ఇంగ్లిపీసు పనులు మనకొద్దు.

వాగనుశాసనుడు

నీ ఇష్టం.

అచ్చమ్మ

ఓ మాటడగనా ?

వాగనుశాసనుడు

వేయి మాటలడుగు! మై కంట్రీ క్వీన్ !

అచ్చమ్మ

కంటికి వెన్నేటి ?

వాగనుశాసనుడు

అయ్యో! తప్పొచ్చింది — మాట పొరపాటు.

అచ్చమ్మ

సరేకాని, ఇంతమంది అమ్మోర్లుండగా నన్నెందుకు పిల్లాడతా నన్నావు బావా, నే అంత అందంగా ఉన్నానా ?

వాగనుశాసనుడు.

ఔను — అది కాకుండా మనం సాధారణంగా నూస్తే ఆ అమ్మోర్లందరు రంగువేసుకొనే బొమ్మలు. సరదాగా ఉండ డానికేకాని, పెళ్లికి పనికిరారు.

అచ్చమ్మ

అదేం ?

వాగనుశాసనుడు

అంతేలే !

అచ్చమ్మ

నాకో ఇల్లు కట్టిస్తావా ?

వాగనుశాసనుడు

ఒక ఇల్లే ఏఁవిఁటీ, ఇంటినిండా పిల్లలినికూడా నింపేస్తా.

అచ్చమ్మ

(సిగ్గుచూపుచు) సరిలే బావా, నీ మాటలూ! — సిగ్గేయదూ!

వాగనుశాసనుడు

నా అచ్చీ! — అలాంటిబ్రతుకు ఎలా ఉంటదో బాగుండేలా గున్నదనేకాదూ, నరేంద్రుడు ఇచ్చిన సలహాపై పెళ్లిచేసుకొనే ఉద్దేశంలో పడ్డాను. మనకు ఇల్లు ఒక చిన్ని పొలం ఆ మహాను భావుడే ఇస్తానన్నాడు — (తనలో) అదే నా పూర్వఉద్దేశాన్ని చింతామణికింద మార్చేసింది — (బహిరంగముగ) మహాదాత, మాంధాత, అతడు.

అచ్చమ్మ

మీ తాతా ?

వాగనుశాసనుడు

అచ్చే — బాగా ఇచ్చేవాడని అర్థం.

అచ్చమ్మ

అదీ తెలుగేనా!

వాగనుశాసనుడు

ఆ, అదేలే —

అచ్చమ్మ

నాకు పెద్దమాటలు తెలవవు.

వాగనుశాసనుడు

నే చిన్నమాటలు నేర్పించనా? — నేర్చుకుంటావా?

అచ్చమ్మ

ఆఁ.

వాగనుశాసనుడు

ఐతే — నేర్చుకో — ముద్దు — (సమీపించును)

అచ్చమ్మ

(నవ్వుతూ) మా బాగా నేర్చేవు — కాని ఎంగిలి నేయకేం,— ఆఁ — మరిసి పోయాను — పెల్లింకా అవ్వందే — అందాకా అలాంటి పని ఈల్లేదు.

వాగనుశాసనుడు

నా అచ్చీ— అడ్డుపెట్టకూ—ఐనస్టే!

అచ్చమ్మ

ఈల్లేదు, ఐనస్టేవిటీ — అవ్వాలి. అందాకా నేయి మీాదేస్తె ఒప్పుకోను.

వాగనుశాసనుడు

సరే నీ ఇష్టం! (మనసులో) ఇలాంటి బాధని ప్రోలాంగు చేయుటలో 'ప్లెజరు' ఉంది.

అచ్చమ్మ

బావా, పెళ్ళయ్యాక ఏంపని సేస్తావ్రా ?

వాగనుశాసనుడు

పిల్లలిని పుట్టిస్తా !

అచ్చమ్మ

సాల్లే ! — ఇంకా.

వాగనుశాసనుడు

కవిత్వం సెప్తతా, ఉపన్యాసాలిస్తా.

అచ్చమ్మ

అలాంటియి మనకొద్దు — మంచిపనులు కావాలి.

వాగనుశాసనుడు

ఏలాంటివి ?

అచ్చమ్మ

గొవ్వు తవ్వాలి, నీరు కట్టాలి, దున్నాలి, గింజలు జల్లాలి.

వాగనుశాసనుడు

అలాంటియి చాలా మోటపనులు, నాకు అంత సరిపడవేమో ! — సరే చూద్దాంలే, నీ ఇష్టం ఒచ్చినట్టే !

(ఒక పల్లెటూరివాడు ప్రవేశించును)

అచ్చమ్మ

అయ్యో, మా యింటోడు — కొడతాడేమో పారిపోదాం !

వాగనుశాసనుడు

రా, త్వరగా (పరుగెత్తి, అచ్చమ్మకంటె ముందు వెడలి పోవును)

పల్లెటూరివ్యక్తి

అచ్చీ, ఆగు, ఒక మాట !

అచ్చమ్మ

కొడతావేవోం.

పల్లెటూరివ్యక్తి

కొట్టను ఇంక.

(తెరలోనుండి వాగనుశాసనుడు, ‘అచ్చీ, రా, రా’)

పల్లెటూరివ్యక్తి

ఆ డెవడే, అచ్చీ ?

అచ్చమ్మ

ఆడొరి ముండాకొడుకు పారిపోయేడు (బిగ్గరగ) నేనురాను.

పల్లెటూరివ్యక్తి

ఓ అబ్బీ, ఇలా రా ! — ఎందుకు పోతున్నావూ !

(వాగనుశాసనుడు తెరలోనుండి, “వస్తాను రాక్షేం ! —అనవసరం వివ గోలేవీఁ ఉండకూడదు”)

పల్లెటూరివ్యక్తి

రా అయ్యా ! — ఏవీఁలేదులే.

(వాగనుశాసనుడు ప్రవేశించును)

పల్లెటూరివ్యక్తి

ఓరి ఈడా ! అల్లప్పుడు ఆసభలో కేకలేసినోడవు కాదూ, పోలీసోళ్ళొస్తే పారిపోయేవుగా !

వాగనుశాసనుడు

ఓహో, జ్ఞాపకం వచ్చింది — (అచ్చమ్మను చూచి) మే మిద్దరం

చాలా స్నేహితులం — అంచేత ఒరే ఒరే అనుకునే అంత స్నేహం.

పల్లెటూరివ్యక్తి

నీకు నాకు స్నేహం ఏఁవిఁటీ! — అచ్చీ, ఈడితో నేస్తఁవాఁ— ముట్టలేదుకదా ఈఅసాధ్ధం ముండాకొడుకు — నీకోసం వాకబ్ చేస్తా ఇక్కఁడికొచ్చా.

అచ్చమ్మ

లేదు బావా! — ముట్టనిస్తానా!

పల్లెటూరివ్యక్తి

మరి నాతో రా, తీసుకుపోతా, నిన్నేలుకుంటా, కులంతప్పు తీయించేస్తా!

అచ్చమ్మ

కొట్టనని ఒట్టేసుకో!

అచ్చమ్మ

నాతోడు, నా అమ్మతోడు, నూకాలమ్మతోడు.

అచ్చమ్మ

సరే రా బావా, పోదాం, కాపురం సేసుకొందాం, మన ఇల్లుబాగుందా?

పల్లెటూరివ్యక్తి

ఆ. కాని అచ్చీ, నీవెళ్ళిందగ్గరనుంచి అదో భీతాకరంగా ఉండేది — ఉప్పునేవేసి తరవాణి నీమోస్తరుగా ఎవరూ కాయలేరే, రా పోదాం.

వాగనుశాసనుడు

(నిష్ఫ్వరపాటుతో) నా మాటేమిటి ?

అచ్చమ్మ

ఆడారి ముండాకొడుకు మాటనమ్మి మోసపోలేదు — నూకా లమ్మకి ఒక కోడిపుంజు ఇచ్చుకుంటా !

(పల్లెటూరివాడు, అచ్చమ్మ నిష్క్రమింతురు)

వాగనుశాసనుడు

సిట్యుఏషన్ అంతా ట్రాన్సు ఫార్మ్ ఐపోయింది. అరేరే — నెవర్ మైండ్ — పల్లెటూరివారికి డర్టీ హాబిట్స్ — ఇదీ గాడ్ సెన్డ్ !—ఇంకో దండయాత్ర చేయాలి — ఏ వాసంతినో గబుక్కున పెళ్ళి చేసుకోవాలి ఏంచేస్తాం ! – సెకండు బెస్టు ! — లైఫులో గెటాన్ అవ్వాలి ఏదోవిధంగా !

(మరియొక పైపునుండి నరేంద్రుడు ప్రవేశించును)

వాగనుశాసనుడు

నరేంద్రా, ఏమైందో విన్నావా ?

నరేంద్రుడు

చకుముకా ? — ఏం.

వాగనుశాసనుడు

అచ్చమ్మను నన్ను పెళ్లి చేసుకోడానికి ఒప్పించేను. ఇంతలోకి దాని పాత మొగుడొచ్చి దాన్ని ఒప్పించి తీసుకు పోయాడు— అన్యాయం — చూసేవా !

నరేంద్రుడు

దాని భర్త దానిని తీసుకపోవటం తప్పేనా ! (నవ్వును)

వాగనుశాసనుడు

అది కాదోయి, అసలు విషయం అవకతవకగా మారి పోయింది! — ఏం — చాలా అలసిపోయినట్టు కనిపిస్తున్నావు !

నరేంద్రుడు

చకుముకీ, — శాంతిలేదు, శాంతిలేదు —

వాగనుశాసనుడు

ఏం నరేంద్రా ? ఎందుకీ బాధ నీకు పాపం ?

నరేంద్రుడు

బ్రతకటమే బాధగా ఉంది—బ్రతుకు సిరర్థకం అనుకోని ఏదో ఆశయం పెట్టుకోని పని చేస్తుంటే, దానికెన్నో ఆటంకాలు ! — నాకోనమా — ఎక్కడో ఏదో లోపం ఉండాలి — లేకపోతే మనుష్య యత్నం, శక్తి, ఇంత వ్యర్థకములా ! — లేక ఈశ్వరుని అనంత శక్తిలో, దాక్షిణ్యమునకు తావు లేదా ! —

వాగనుశాసనుడు

నాకూ ఆ సందేహాంవే ఇంతకుముందే కలిగింది — కాని —

నరేంద్రుడు

చకుముకీ, చాలా గందరగోళంగా ఉంది — అర్థంకావటం లేదూ — ఎందుకీ నాటకం అంతా ?

వాగనుశాసనుడు

నరేంద్రా, నీకు విశ్రాంతికావాలి —

నరేంద్రుడు

ఈ లోకంలోనా !

వాగనుశాసనుడు

ఆ, — అదికూడా ఇప్పుడే —

నరేంద్రుడు

నావ్యక్తి —

వాగనుశాసనుడు

అదే తప్పు — ఒక వ్యక్తి ఏమిటి ! ఒక వ్యక్తి అనుకొనేది నిజంగా అనేక వ్యక్తులు — చూడు — కోపం వచ్చినప్పుడు ఒకవ్యక్తి, విచారం వచ్చినప్పుడు ఒకవ్యక్తి, ప్రేమవచ్చినప్పుడు ఒకవ్యక్తి, — భయంవేసినప్పు డొకవ్యక్తి — మొండితనం వచ్చినప్పుడు ఒకవ్యక్తి, నవ్వినపు డొకవ్యక్తి, ఏడ్చినప్పు డొకవ్యక్తి ఇన్నివ్యక్తులు కలిసిన కదంబం ఏమనసులోనివ్యక్తి అనేది —

నరేంద్రుడు

నిజమేఐఉండవచ్చును — లేకపోతే శక్తి, అశక్తి — సత్యం, అసత్యం — సౌందర్యం, వికారం — ఔన్నత్యం, హీనత్వం, ఒక మానవ హృదయంలో. నీలో నాలో ఎలా ఉంటాయి—కాని— వీని అన్నింటిని అతిక్రమించిన తత్వం ఒకటిలేదూ ? —

వాగనుశాసనుడు

అది ఒక భ్రమ.

నరేంద్రుడు

కాదు—అదే మనుష్యవ్యక్తి, ఆ వ్యక్తికిని ఈశ్వరుని అనంత శక్తికిని ఉన్న సంబంధం, తారతమ్యం, — తెలిసి కోటవే, వ్యాసఘట్టం—శక్తి,—కరుణ,—ఔను — కాదు—ఏమో, ఏమో!

వాగనుశాసనుడు

నరేంద్రా! — ఏంవైందేమిటి ?

నరేంద్రుడు

"యుద్ధం వచ్చింది, ఇటువంటి అనుమానాస్పదమైన చరిత్ర కలవారిని అందఱిని ఒకచోట ఒక కూటంగా ఉంచటం శ్రేయస్కరం కాదు. కాబట్టి వారిని అందఱిని," అంటే మన ఆశ్రమంలో ఉన్నవారిని, "తత్క్షణం ప్రభుత్వమునకు అధీనం చేయవలయును" అని ఒక ఆజ్ఞవచ్చింది. "ప్రభుత్వమునకు వ్యతిరేకులుకారు, ఇప్పుడు నాశిక్షణచే ఉత్తమ ప్రజలక్రింద చాలా వఱకు మారినారు. ఇప్పుడు ఈవిధానాన్ని ఆటంకపరచటం ఏ దేశానికి శ్రేయస్కరంకాదు—ఇది లోకోపకారం చేస్తుంది" అని నేను తెలియచేసినా, "వీల్లే" దని ప్రత్యుత్తరం —

వాగనుశాసనుడు

(కంగారుతో) ఐతే మమ్మల్నందఱిని ఈ యుద్ధంలో శతఘ్నులముందు వేసేస్తారా ఏమిటి?

నరేంద్రుడు

అదికాదు—బహుశః ప్రతివ్యక్తియొక్క నిర్దోషత్వనిరూపణ అయ్యేవఱకు కారాగారం.

వాగనుశాసనుడు

ఓ నరేంద్రా! — రక్షించాలి — విడిచిపెట్టకు నిర్దోషులం — అందులో ముఖ్యంగా నన్ను —

నరేంద్రుడు

వరవాలేదు—కాని చకుముక్కీ, నీ కెన్నిసార్లు చెప్పినను నీవనే స్వార్థపరత్వాన్ని చంపుకోలేక పోతున్నావు. చూడు మిగిలిన వారు ఎంత —

వాగనుశాసనుడు

ఎలా చంపుకోగలను నేను అనే ఒక మనిషిని బ్రతికియున్నంత కాలం? నేను లేనని నేనెలా అనుకోను నే నున్నప్పుడు?

నరేంద్రుడు

అదికాదోయీ! స్వార్థపరత్వం.

వాగనుశాసనుడు

ఆవిషయం ఎంతవఱకు ప్రయత్నించినా, వితత్కాలంలో వెనుకటిగుణం వచ్చేస్తుందిట—ఏం జేయనూ!

నరేంద్రుడు

(నవ్వును)

వాగనుశాసనుడు

నవ్వకేంగాని, అభయం ఇయ్యాలి.

నరేంద్రుడు

తప్పకుండా, నాప్రాణం మీకడ్డం వేస్తా — శపథం.

వాగనుశాసనుడు

సెహబాస్, మహావీర! — ఇప్పుడు నాప్రాణాన్ని నీకోసం అర్పించడానికి సిద్ధుణ్ణి.

నరేంద్రుడు

చకుముకీ—చాలా చలిగా ఉంది—ఆమంచుపర్వత శిఖరాల మీాదనుంచి వచ్చేగాలిని ఓర్చుకోటం ఇప్పుడు కష్టం అనిపిస్తుంది, వయస్సు మళ్లుతోంది—ఈ అనుభవం ఈలోకంయొక్క మొదటి వీడుకోలు చిహ్నమా, లేకపోతే వచ్చే లోకంయొక్క ప్రథమాహ్వానమా ?—

వాగనుశాసనుడు

నరేంద్రా !— ఇది మతిపోయే ప్రథమ చిహ్నం ! ఈపిచ్చి ఆలోచనలు వద్దు!—రా వెళ్లాము, సూర్యాస్తమానం ఔతోంది.

నరేంద్రుడు

అస్తమించనియ్యి! — అస్తమించాలి—మళ్లీ ఉదయించాలి (ఆలోచన)

వాగనుశాసనుడు

కవిత్వం ఎప్పుడైనా చెప్పేవయ్యా ?

నరేంద్రుడు

ఏం —

వాగనుశాసనుడు

లేకపోతే ఈధోరణి పుట్టదు ; —

నరేంద్రుడు

విసిగిపోయిన నిరర్థకమైన బ్రతుకు దేన్నైనా పుట్టిస్తుంది — అబ్బా ఎంత ఎఱ్ఱగా ఉన్నదో సూర్యాస్తమయం —

వాగనుశాసనుడు

తప్పతాగినవాడికళ్లు అంతకన్నా ఎట్లాగా ఉంటాయి—దానిలో గొప్పేం!—

నరేంద్రుడు

తెల్లని మంచు — ఎఱ్ఱని కాంతి — ప్రియురాలి శరీరంపై లత్తుక కాంతా! — లేక రక్తపు కాల్వల యొక్క రంగా! — చూడు చకుమఃకీ, ఎంత అందంగా, ఎంత భయంకరంగా ఉందో!

వాగనుశాసనుడు

క్షమించు — నీకేమీ కనుపించను—ఎండ, మంచు—అంతే!—సాధారణంగా మీలాంటివాళ్లకున్న వైపరీత్యం ఏ ఇది — లేనివి చూస్తారు. ఉన్నవి చూడరు. రా, వెళ్దాం! నీ ముఖం చాల వాడిపోయి ఉంది—

నరేంద్రుడు

ఏం, ఉన్నది — ఈ ప్రపంచంలో ఏమీ లేనప్పుడు, హృదయం ఎండిపోయినప్పుడు, ముఖంలో ఏం కళ ఉంటుంది—

వాగనుశాసనుడు

ఏమీ లేకపోవటం ఏమిటి? కావలసినంత ఉన్నది—రా, వెళ్లి త్వరగా భోంచేసి పడుకుందాం!

నరేంద్రుడు

నాకు నిద్రరావద్దూ—ఇక్కడ నిర్మానుష్యంగా ఉంటుందని వచ్చేను- ఒక నిమిషం కూర్చో, తరవాత వెళ్దాం! ఇక్కడనుంచి మన యింటికి ఏమంత దూరం!—

వాగనుశాసనుడు

సరే (కూర్చుండును). ఆకలి చంపేస్తది.

నరేంద్రుడు

(కూర్చుండి) ఆత్మయొక్క ఆకలి ఇంకెంత చేస్తదో తెలుసునా?

వాగనుశాసనుడు

ఆత్మకి కడుపేఁవిటీ, అదుంటేనేకాదు ఆకలి—ఎందుకీపిచ్చి వేదాంతం!

నరేంద్రుడు

చకుముకీ,—ఒక విషయం చెప్పాలి—ఆమె మళ్లీ కనుపించింది.

వాగనుశాసనుడు

ఎవరు ఈ "ఆమె"

నరేంద్రుడు

"ఆమె" నా హృదయం ఎవరికి అర్పించేనో ఆమె.

వాగనుశాసనుడు

అబ్బా ఇన్నాళ్లకా! — మాట్లాడేవా! — చెప్పు ఎక్కడున్నదో! — ఒక్క నిమిషంలో కుదిర్చేస్తా!

నరేంద్రుడు

(తలనూపును)

వాగనుశాసనుడు

ఏం!

నరేంద్రుడు

ముందు నేను భ్రమిస్తున్నా ననుకొన్నాను కాని అది భ్రమ కాదని గ్రహించేను. ఆమె నన్ను ప్రేమ పొంగిపోవు చూపుతో చూచి, చిరునవ్వు నవ్వింది — ఆమెకు నమస్కరించి, నావిపరీత మైన ప్రేమను ఆమెకు విశదపఱచి, ఆమె లేనిదే బ్రతకలే నన్నాను!

వాగనుశాసనుడు

ఏమన్నది —

నరేంద్రుడు

"నిన్ను నేనుకూడ ఆనాటినుండి మహోగ్రంగా ప్రేమిస్తు న్నాను. నాకుకూడా నీవు లేనిదే బ్రతకటమే కష్టం! ఐనా ఈ జన్మంలో వీలులేదు. లేదు వాంఛయొక్క పరిపూర్తి. ఇచ్చట మనకొఱకు మనం జీవించటం. అంతకంటె ఎక్కువ చెప్పలేను," అని అన్నది. ఆమె ఎవరో చెప్పినది — ఎవ్వరితో ఆ పేరు చెప్పవద్దన్నది. "ఈ జీవనమే చివరదికాదు. ఇది ఒక్కటే లోకంకాదు. తప్పకుండా ఈ జీవితాంతాన్ని, నిన్ను కలుసు కుంటాను, ఇంక అప్పటినుండి మనకు ఎడబాటు అనేది అనంత కాలంలో లేకుండా చేసుకుందాం!" అన్నది — "భవిష్యత్తు నందు అంత నమ్మకమేమిటి" అని అన్నాను. "నమ్మాలి" అని అన్నది. "అంతవరకో" అన్నాను. "ఒకరి నొకరు ప్రేమించు కుంటున్నా మనేదే" అన్నది — "మనదొక పెద్దయత్నం" అన్నాను. "ఔను — యత్నం, ఇచ్ఛ ఒకటే" అన్నది.

"యత్నం తప్పక చేస్తాను, అంతకంటె కావలసిందేమీటీ"
అన్నాను. "శపథం" అన్నాను. "శపథంనేనుకూడా" అన్నది—
"ఈలోకాన్ని మళ్లీచూడవు — పునర్దర్శనంవఱకు శలవు"
అన్నది. ఒకమారు చెప్ప వీలుకాని క్రొత్తచూపు చూచి ఒక్క
కన్నీటిచుక్క రాల్చి వెడలిపోయింది — నాకు వెలుగు చీకటి
ఒకటయ్యేయి.

వాగనుశాసనుడు

(ఆలోచించి) చూడు, — నీవొక్క గొప్పకార్యం తలపెట్టేవు.
దానికి భంగంరానియ్యకు.

నరేంద్రుడు

నేను రానివ్వకుండా యత్నిస్తా — ప్రపంచ జీవనంలో నా
ఒక్క జీవనం ఎంత!

వాగనుశాసనుడు

కాని మాకు చాల ముఖ్యం ఐంది అయ్యా!

నరేంద్రుడు

అది, సరికాదు — ఒకళ్లైనపిదప ఒకళ్లు. ఒకడిని మించిన
వాడింకొకడు — ఒకడు ప్రారంభించింది ఇంకొకడు పూర్తి
చేస్తాడు. అనంతం ఐన గొలుసులో మనం ఒకలంకె!

వాగనుశాసనుడు

పోనీ అది గట్టిగా ఉండాలి!

నరేంద్రుడు

అదే యత్నంకాదూ! — యత్నం, యత్నం — ఈలోకాన్ని

ఉంకోలోకాన్ని, ఎన్నోలోకాల్ని! — ఇంతచేసినా, ఇదమిద్ధం అని నిర్ధారణ ఏదీ! — ఊహ — అంతే — ఏమో, ఏమో!
(నిశ్శబ్దము)

వాగనుశాసనుడు

ఉంకోలోకంగురించి ఎందుకీ గొడవ — ఉన్నదే, ఇదే నిజం ఐంది — అక్కడ అనేది ఒకవేళ ఉంటేమాత్రం, సుఖం ఇస్తదని నమ్మకం ఏదీ.

నరేంద్రుడు

నిజఁవే కానిఆశ. ఆశ లేకపోతే బ్రతకటం ఎలా! — ఉంకో మాట. ఆలోకాల్లోగూడా ఇటువంటి కష్టాలు, అశాంతి ఉన్నా ప్రస్తుతబాధ దాటటం అనేదే చాల ముఃఖ్యం ఐంది జీవికి.

వాగనుశాసనుడు

జీవికి ముఖ్యం ఐంది భోజనం! ఆకలేస్తోంది పోదాం, రా.

(ఘటోత్కచుఁడు ప్రవేశించును)

ఘటోత్కచుఁడు

ఆర్యా! తమరీవైపు వచ్చిరని తెలిసి ఇద్దరు పోలీసు వాళ్లు వస్తున్నారు తమకి ఎరస్టు వారన్టు అనుకుంటాను.

నరేంద్రుడు

వారంటా, మంచిదే — ఈ ఆశ్రమవిషయమై ఐఉంటది.

వాగనుశాసనుడు

(లేచి క్రిందనుంచి వచ్చుమార్గము వైపుచూచి వేగముగా పాకను ప్రవేశించి) "రండీ, రండి రక్షించండి — దెయ్యం పాకలో" (అని దిగ్గ

రగ పలుకును.) "ఘటోత్కచా అక్కడే జాగ్రత్తగ కాయి"
(అనును)

నరేంద్రుడు

(పాకను ప్రవేశింప, వాగనుశాసనుడు బయటకువచ్చి, నరేంద్రుని పాక లోనుంచి, తలుపువేసి బధించును)

ఘటోత్కచుఁడు

ఏమిఁటిదీ!

వాగనుశాసనుడు

(మాటలాడవద్దని సంజ్ఞచేసి, మెల్లగ) పోలీసులనుండి ప్రస్తుతం రక్షించాలి.

నరేంద్రుడు

(తలుపు గుద్దుచుండును)

(పోలీసులు ప్రవేశింతురు)

వాగనుశాసనుడు

అయ్యా రక్షించాలి, నరేంద్రుడు ఆపైకి (మంచు శిఖరమును చూపుచు) వెళ్లిరాలేదు. ఇంకా మీరు వెళ్లి వెతకాలి — సూర్యాస్తమానం ఐంది — ఇక్కడ —

పోలీసు ఇన్స్పెక్టరు

మీరేం చేస్తున్నారు?

వాగనుశాసనుడు

అతన్ని వెతకబోతుంటే ఎలుఁగ్గొడ్డు ఒకటి మమ్మల్ని తరి

వింది — మేంవుం ఆపాక వెనక్కి వెళ్తే అది పాకలో దూరింది, మేంవుం గుబుక్కున తలుపేశాం.

(తలుపుశబ్దం)

వాగనుశాసనుడు

ఇంకో మూడునాల్గు నిమిషాలలో బ్రద్దలుగొట్టి బయట పడతది. మీరు కావలాఉండి ఈ పెద్దరాతిని మేము విసరాలను కున్నట్టు దానిమీద రాగానే వేయండి, లేకపోతే చుట్టుప్రక్కల ఉన్న మనుష్యుల్ని చంపేస్తది. మేం నరేంద్రుని వెతుకుతాం.

పోలీసు ఇన్స్పెక్టరు

(వెనుకకు నడచుచు) మహా బాగాఉంది—నరేంద్రునికి వారంటు కాని ఎలుగుకి కాదు – అదికాకుండా మాదగ్గర తుపాకులు లేవు, మీరే జాగ్రత్తగా చూడండి (అని అతిత్వరితముగ నిష్క్ర మింతురు.)

ఘటోత్కచుడు

(నెమ్మదిగా) అసాధ్యుడా!

వాగనుశాసనుడు

ముండాకొడుకులు ఎలా పరిగెడుతున్నారో (బిగ్గరగ) వచ్చేస్తుంది, వచ్చేస్తుంది!

ఘటోత్కచుడు

(చూచుచు) (నవ్వి) లేళ్లలాగున దూకిపోతన్నారు.

వాగనుశాసనుడు

(నెమ్మదిగా తెడలి తలుపుతీయును.) (నరేంద్రుడు ప్రవేశించును)

క్షమించాలి, పోలీసువాళ్లని నిన్ను చూడకుండా పంపించే విషయం ఐ ఇలా చేయవలసి వచ్చింది.

నరేంద్రుడు

నా అభిప్రాయనికి వ్యతిరేకంగా చకుముకీ నన్ను పిరికిపందని చేసేవు! — నేను ఇప్పుడే వెళ్లి పోలీసుస్టేషన్లో నన్ను అప్ప చెప్పుకుంటాను.

వాగనుశాసనుడు

అలాగే చేయొచ్చు. కాని ఒక విషయం — నువ్వు అలా చేస్తే నిన్ను నమ్ముకొని వచ్చినవాళ్లని విడిచిపెట్టిన వాడవు అవవూ! — వాళ్లకుకూడా కారాగార ప్రాప్తా! — అదికాకుండా నీగొప్ప ప్రయత్నం, దుర్మార్గులని సన్మార్గులుగా చేసే విధానం, దానిపై ఆధారపడి ఉన్న లోకకళ్యాణభంగం రావూ! —

నరేంద్రుడు

మరి, ఏంచేయగలనూ!

వాగనుశాసనుడు

అంత శక్తిలేనివాడవు ఎందుకు దిగేవు? — ఇంత మంది గొంతుకులు కోయటం ఎందుకూ!

నరేంద్రుడు

(ఆలోచించి) మరి నా గౌరవం, నాధైర్యం, నావిధి, ఇవన్నీ పోవూ, నేను ఈవిధంగా ప్రభుత్వాన్ని తప్పించుకొంటే!

వాగనుశాసనుడు

నీస్వార్థంకొఱకు మమ్మల్ని గంగలో కలిపేస్తావా? ఏది న్యాయమయ్యా!

నరేంద్రుడు

(ఆలోచించి) చకుముక్కీ వేంచేస్తాం !

వాగనుశాసనుడు

భేష్, నాకు తెలుసును నీస్వార్థరాహిత్యం! — ప్రస్తుతం ఊరుకుండి ఇవ్వేళ రాత్రికో రేపు ఉదయానో ప్రధాన మంత్రితో టెలిఫోనుద్వారా మాట్లాడు — కొద్దిదినములలోనే ఈఆశ్రమాన్ని విడదీసేస్తాను — ఆశ్రమవాసులు, మునుపటివారు కారు — ఎంతో మార్పు, అవకాశంఉంటే ఉత్తమప్రజలుగా మారిపోతారు — కాని ప్రస్తుతస్థితిగతులను బట్టి, వాళ్లని పంపించేస్తాను వేరువేరుగా అని చెప్పు. దానిమీద ఏదో వీళ్లకి ఇంతో అంతో దిక్కు చూపించి పంపించేయి — వీళ్లని ఎవరితోవని వాళ్లని పంపించేయుమని చెప్పందును కాని నీకది నచ్చదని తెలుసు.

నరేంద్రుడు

అది ఇదివరకే ఐనది — కాని లాభంలేకపోయింది — ఆశ్రమ వాసులు అపాయం ఐనవాళ్లని ప్రభుత్వానికి వార్తలు వచ్చేయట! అంచేత!

వాగనుశాసనుడు

ఎవరీ అబద్ధాలు వ్రాసేరో.

నరేంద్రుడు

చకుముకీ! అబద్ధాలు వ్రాయడానికి ఒకళ్లేంవిటి! —

వాగనుశాసనుడు

అది ఎలా నమ్మవచ్చు ?

నరేంద్రుడు

యుద్ధకాలంలో ప్రభుత్వం, జాగ్రత్త తీసుకోవటం, అవసరఁవేఁ. మన దురదృష్టం — విధి — యుద్ధం — సర్వనాశనం — అమానుషం! ఎవరికి లాభం!

(వాసంతి ప్రవేశించును వేగముగా)

వాసంతి

చాలామంది పోలీసులువచ్చి, మన ఆశ్రమవాసులందరినీ తీసుకుపోయినారు. నేను కొంచందూరాన్ని ఇది చూచి మీ రీవైపు రావటంచూచి వేగంగా వచ్చేను. ఇక్కడున్న వాళ్ళఁవేఁ మిగిలేఁవు! కొందఱు చాలా ధైర్యంగా ఉన్నారు. — కాని కొందఱి భయం, అశక్తిచూస్తే బ్రద్దలైపోయింది గుండె.

నరేంద్రుడు

అయ్యో! నన్ను నమ్మినవాళ్లను అప్పజెప్పేసేను! త్వరగా వెళ్లాలి (నిష్క్రమించబోవును)

యోగనుశాసనుడు

ఆఁ. వెళ్లి ఏంచేస్తావు? — నువ్వుకూడా ఖైదులోకూర్చొని, వాళ్ళతో పాటు ఏడుస్తావా? — స్వయంగావెళ్ళి రాజధానికి, ప్రభుత్వాధికారులతో మాట్లాడి ఏఁవైనా వీలుంటేచేయి —

నరేంద్రుడు

ఏఁవీఁలాభం ఉండదు —

యోగనుశాసనుడు

నువ్వు వెళ్ళిమట్టుకు లాభంఏఁవిటి ఇప్పుడు.

నరేంద్రుడు

ఔను ఏంపీ లాభంలేదు. (తదేకదీక్షతో పర్వత శిఖరములవైపు చూచుచు) ఏంపీ లాభంలేదు — ఎవరు ఉండీ లాభంలేదు — అందరు అనవసరం.

వాగనుశాసనుడు

నరేంద్రా —

నరేంద్రుడు

(వినుపించుకొనక) నేను బ్రతికికూడా లాభంలేదు —

వాసంతి

అదేంమాట — ఎంతెయో అవసరం.

నరేంద్రుడు

నా యత్నం విఫలం ఐంది — నా విధానం దగ్ధంఐంది — ప్రపంచకల్యాణం కోసం చేసే యత్నాలకుకూడా విఫలంవా!— ప్రపంచకల్యాణం అవసరంలేనా! — ఏమో — ఇంతకంటె ఈ లోకాన్ని సౌఖ్యం ఉండకూడదా!

వాగనుశాసనుడు

వాసంతీ, ఏదో ధోరణిలో ఉన్నాడు. మనం తీసుకువెళ్ళాలి.

ఘటోత్కచుడు

ఆర్యా!

నరేంద్రుడు

(నిశ్శబ్దం)

వాగనుశాసనుడు

వెళ్దాం.

వాసంతి

(నరేంద్రుని చేయిపట్టుకొని) ఆర్యా వెళ్దాం. చీకటి పడుతున్నది —

నరేంద్రుడు

ఔను, నావని విఅపోయింది, బాధ, అశక్తత, విఫలం నా జీవనహారంలోని మాణిక్యాలని వ్రాయండి —

వాగనుశాసనుడు.

(చేయపట్టుకొని) రా!

నరేంద్రుడు

రాను, వెళ్తాను. (చేతిపట్టును వదల్చుకొనును)

వాగనుశాసనుడు

నరే —

నరేంద్రుడు

(పర్వత శిఖరముపైపు నడచును)

వాగనుశాసనుడు

నరేంద్రా — అదేఁవిటీ, ఇటు, క్రిందకి.

నరేంద్రుడు

క్రిందకికాదు పైకి — పైకి, ఎప్పుడుపైకి, ఏఁవైనాపైకి —

వాసంతి

మతి చలించినదా పాపం (వాగనుశాసనునితో)

నరేంద్రుడు

లేదు — అది ఇంతవఱకూ లేదు —

ఘటోత్కచుడు

అయ్యో! మబ్బుకూడా వేసింది, గాలిహోరు అదిగో మెఱుపు, భయంకరంగా ఉంది, అపాయం — బాధగా ఉంది చలి.

నరేంద్రుడు

మానవజీవితంకన్నా నా! — (వారినిచూచి) నాయొక్క ఆస్తి అంతా మీ అందఱికి పంచిపెట్టి ఆ కాగితమును రెజిస్టరుచేయించేను మీరు దానిని స్వీకరించి, లోకకల్యాణంకొరకు ఏదో విధంగా పాటుపడండి. ఇదే నాకోరిక, — నా పని ఐపోయింది నాకింక శక్తిలేదు — (కొండ ఎక్కును)

వాగనుశాసనుడు

చూడు ఏమిటీ ఉద్దేశం —

నరేంద్రుడు

తాపంగా ఉంది — మంచుమధ్య నుంచుంటే చల్లగా ఉంటుందేమో, — ఆ మెఱుపు మెఱసేచోట ఎంత అందంగా ఉందో — కాలచక్రం నిర్దాక్షిణ్యంగా తిరుగుతున్నది — స్వస్తి — (వేగముగా కొండనెక్కుచు నిష్క్రమించును)

వాగనుశాసనుడు

నరేంద్రా మేంకూడా వస్తున్నాం — (తెరనుండి నరేంద్రుడు) "రావద్దు, రావద్దు — అనవసరం —"

వాసంతి

అయ్యయ్యో! ఎంతదూరం అప్పుడే వెళ్ళిపోయేడో — రండి

మనం కూడా వెళదాం — ఆపాలి — లేకపోతే అపాయం — ఆ మంచుతుపానులో (ముగ్గురు వెడలబోవుదురు)

ఘటోత్కచుఁడు

కొంప మునిగినది — రాళ్ళతో మంచుతో కలిసిన ఒక పెద్ద ప్రవాహంమీదకి వస్తోంది — దానికి ఎదురుగా నిశ్శంకగా వెళ్తున్నాడు — అయ్యో వద్దు — వద్దు —

వాగనుశాసనుడు

ఇంక లాభం లేదు — మనం ఇంకేమీ చేయలేం — శ్రీరామ రామ చూడలేం — వాలు అటుఉన్నా మనమీదకి ఆపాతం రావచ్చు — క్రిందికిరండి. మనం చచ్చి అతన్ని బ్రతికించ గలఁవా? (వాసంతి చేయిపట్టుకొని లాగుచు అతివేగముగా నిష్క్రమించు చుండును.)

ఘటోత్కచుఁడు

(వేగముగ నిష్క్రమించుచు) అయోమయం — ఈశ్వరా! —

వాసంతి

(నిష్క్రమించుచు) ఎందు కీ చావు — ఎందు కీ బ్రతుకు! — (దూరమున మహాప్రవాహపు శబ్దము)

(తెరపడును)

# "తెరనికోఁ దిక - తరువాత"

## పంచమాంకము

కాలము — మానవకాలముకంటె వేరు, అందుచే నిర్ధారణ అశక్యము.

ప్రదేశము (చీకటి వెలుగు కలసినట్టియో లేనట్టియో, ప్రదేశము. ఘన రూపము జలరూపము తేజోరూపము ఐనట్టియో కానట్టియో స్థలము. భూలోకముకంటె భిన్నమైన లోకము.)

ప్రవేశము (కనుపించియు, కనుపించని అస్ఫుటమైన వ్యక్తులు- 3 లేక 4. మఱియొకవ్యక్తి వెనుకకు నడుచుచు ప్రవేశించును — అది నరేంద్రుని ఆత్మ.

నరేంద్రుడు

నా శరీరం నలిగిపోయింది. ముద్దైనది — ఒక క్షణంలో బాధ మాయమైపోయింది ఎంతో తేలికగా, ఎంతో హాయిగా, ఎంతో వింతగా ఉన్నది. శరీరంనుండి విడిపోయాను. మరణించటం ఐపోయిందికాబోలు—నేను ఉన్నానుకాని, శరీరంవంటిది తగలటం లేదే — ఏదో ఉన్నది. కాని, ఇదివరకులాంటిది కాదు — అదిగో భూమి దూరం ఐపోయింది — ఇదంతా అయోమయం — మరణానంతర జీవితం! దేవా ఎక్కడున్నా, రక్షించు —

ఒక వ్యక్తి

నరేంద్రా ! —

నరేంద్రుడు

ఎవరిదీ — ,

ఆ వ్యక్తి

నే నెవరైనదీ ఇంకా తెలిసికోలేవు — అదిగో నీకు తెలిసిన తిలోత్తమ.

మరియొక వ్యక్తి

నరేంద్రా తిలోత్తమను. నిన్ను ఆహ్వానించడానికి వచ్చేను.

నరేంద్రుడు

(ఆశ్చర్యముతో చుట్టునుచూచుచు) — తిలోత్తమా, — తెలిసిఉన్నవ్యక్తిని, అందులో నిన్ను కలియటం ఎంతో బాగున్నది— ఎలా ఉన్నావూ! — ఇదంతా ఏమిటి — ఇది ఏలోకం —

మొదటి వ్యక్తి

అన్నీ తెలుస్తాయి త్వరలో.

నరేంద్రుడు

వారెవరు?

మొదటివ్యక్తి

వారెవరో నాకు తెలియదు — ఆత్మలు — నాతోఎప్పుడో ఇదివరకో, లేకపోతే ఇంకెప్పుడైనా ముందో సంబంధాలు కావచ్చు, కాకపోవచ్చు — వారివని వేరు — (నరేంద్రుడు, మొదటి వ్యక్తి, తిలోత్తమ తప్ప, మిగిలినవ్యక్తులు అంతర్ధాన మగుదురు)

నరేంద్రుడు

నేను ఏంచెయ్యాలి —

తిలోత్తమ

నరేంద్రా! — క్రొత్త జీవనం — కొంచెంకాలం భగవంతుని ప్రార్థించుకో — శాంతికలుగును. జ్ఞానం కలుగగలదు. — జ్ఞానం, దివ్యజ్ఞానం, ఇచ్చట చాలా అవసరం—

నరేంద్రుడు

(అట్లుచేయును)

నరేంద్రుడు

తిలోత్తమా!

తిలోత్తమ

నరేంద్రా? —

నరేంద్రుడు

క్రొత్తభావం అనుభవిస్తున్నా — కాని ఇంకా ఇక్కడిసంగతులు తెలియుటంలేదు — ఏదో కలవచ్చి పోతున్నట్లున్నది! — అదేవిటీ, అలా రంగురంగుల గోళంలా ఉన్నది.

తిలోత్తమ

అదేభూమి —

నరేంద్రుడు

ఇంతదూరం వచ్చేనా!

తిలోత్తమ

ఇక్కడ కాలాన్నిబట్టి ఒక్క నిమిషం — భూలోక కాలాన్ని బట్టి ఒక్క నెల.

నరేంద్రుడు

నేను భూమిని విడిచిపెట్టి ఎంతసేపైనది.

తిలోత్తమ

భూలోక కాలాన్నిబట్టి సుమారు సంవత్సరం.

నరేంద్రుడు

అబ్బా — ఎంతకాల భేదం —

మొదటి వ్యక్తి

ఒక్కొకలోకాన్ని, ఒక్కొకకాలం, ఒక్కొకరూపం, ఒక్కొకకార్యం, ఒక్కొకజీవనం —

నరేంద్రుడు

దీనికి అంతంలేదా !

మొదటి వ్యక్తి

ఈ లోకాన్ని ఈ జీవితానికొక విధంఐన అందంఉన్నది. కాని అనంత జీవితానికి అంతం ఉన్నట్లు కనుపించదు — అదుగో మనముందు మూడులోకాలు, మూడుజీవనాలు కనుపిస్తున్నాయి—

నరేంద్రుడు

ఔను, ఆశ్చర్యం !

మొదటి వ్యక్తి

అదిగో — ఆవైపుచూడు ఇదివరకు అనుభవించిన, మూడు జన్మాలు, రెండులోకాలు, అందులో ఒకటి భూమి.

నరేంద్రుడు

ఔను—

మొదటివ్యక్తి

భూమిలో నీకు రెండు జన్మాలు.

నరేంద్రుడు

ఔను, గ్రహించ కలుగుతున్నా.

మొదటి వ్యక్తి

నీవు చాలా ధన్యజీవివి ! — అభివృద్ధిలో ఉన్నావు.

నరేంద్రుడు

అర్థంకావటంలేదు.

మొదటి వ్యక్తి

తరువాత అర్థంఔను—

నరేంద్రుడు

తామెవరూ ?

మొదటి వ్యక్తి

భూలోకంలో, మొదటి జన్మంలో నీవు స్త్రీరూపంలో నాకు భిక్ష పెట్టేవు. ఆనాడు ! —

నరేంద్రుడు

ఆఁ, ఆఁ, — జ్ఞాపకం వచ్చింది.

మొదటి వ్యక్తి

నా పని ఐపోయింది, నే వేరేచోటికి వెళ్ళాలి. —

నరేంద్రుడు

ఎక్కడికో అడగవచ్చా —

మొదటి వ్యక్తి

ఉంకో లోకానికి, చాలాపని ఉన్నది. తిలోత్తమ నీకు మార్గం చూపిస్తుంది — ఆమె ఉత్తమలోకంనుంచి ఈ లోకానికి నిన్ను చూడటంకోసం వచ్చింది-ఆమెనియమింపబడినదికూడాను-

నరేంద్రుడు

ఎవరిచేత ?

మొదటి వ్యక్తి

(ప్రత్యుత్తరమియ్యక అంతర్ధానమగును)

నరేంద్రుడు

తిలోత్తమా — ఎప్పటికి మరువలేను.

తిలోత్తమ

నరేంద్రా!

నరేంద్రుడు

నీవు భూలోకాన్నే కాకుండా ఇక్కడకూడా నన్ను రక్షిస్తున్నావా! —

తిలోత్తమ

రక్షించడానికి నే నెవరినీ!—

నరేంద్రుడు

నీ హృదయం! —

తిలోత్తమ

భావం, కొందటికి మారదు —

నరేంద్రుడు

ఇక్కడి సంగతంతా చెప్పు.

తిలోత్తమ

అంతా తెలియగలదు—

నరేంద్రుడు

ఈ జీవితం ఎన్నాళ్ళు?

తిలోత్తమ

చెప్పలేను — కొంతవరకు నీపై ఆధారపడి యున్నది — ఇది

చాలాచిత్రం ఐన లోకాల సమూహం.

నరేంద్రుడు

ఏమీ!

తిలోత్తమ

ఈ స్థితిలో అదే జీవితం అనుకో, కొన్ని లోకాలు మాత్రం, మనం పొందవచ్చు—

నరేంద్రుడు

నువ్వుండే లోకం ఏది?

తిలోత్తమ

అది (చూపించుచు) రా, నీలోకం కొన్నాళ్ళవరకు ఇంకొకటి. నాశక్తిచే నిన్ను నా లోకానికి తీసుకువెళ్తా!

నరేంద్రుడు

సరే — కాని ఆమెకోటకు —

తిలోత్తమ

ఆమె భూమిని విడచినప్పుడు ఆమెను కలియవచ్చు.

నరేంద్రుడు

ఇక్కడ స్త్రీపురుష భేదా లున్నాయా?

తిలోత్తమ

ఉన్నవి, లేవు — భావం — యే ముఖ్యం! ఉద్దేశమే కార్యం! — రా వెళ్దాం — ఆ లోకం చూపిస్తా — అంతకన్నా ఆశ్చర్యం ఐన లోకం.

( తెర పడు ను )

---

# "తీరని కోరిక - తరువాత"

## షష్ఠాంకము

•••○◉○•••

కాలము — ఆ లోకకాలములో 5 నిముషములు.

ప్రదేశము (ఒక ఉన్నతలోకము. వెన్నెలకంటె అందమైన కాంతి, దివ్యమైన గానముతో, పరిమళముతో, మాధుర్యముతో కలసి, ఉన్న తాత్మలను నిత్యము తనియించుచుండును.)

ప్రవేశము (తిలోత్తమ, నరేంద్రుడు.)

నరేంద్రుడు

ఎటువంటి దివ్యమైన ప్రయాణం, ఆకాశమార్గంలో ఏమి చిత్రాలు, ఏమి రంగులు – కాని ఇది అన్నిటిని మించింది — తిలోత్తమా, నేనిక్కడకు రాకూడదేమో !

తిలోత్తమ

రాకూడదని దానికి రాలేవు –

నరేంద్రుడు

ఈ లోకానికి నీవలన వచ్చేను, నాకు అర్హతలేదు.

తిలోత్తమ

దీన్ని మించిన లోకాలు ఉన్నవంట.

నరేంద్రుడు

ఇంతకంటేనా, నీవు చూచావా ?

తిలోత్తమ

లేదు — విన్నాను ! వినికికి, చూపుకి ఎక్కువ భేదంలేదు ఇక్కడ.

నరేంద్రుడు

ఈ దివ్యలోకంలో కష్టాలు ఉంటాయా ?

తిలోత్తమ

నీకే తెలియగలదు — కష్టాలులేని లోకం ఇంతవఱకు నేను అనుభవించలేదు — అనుభవమే వస్తుగ్రహణానికి మూలం — ఇక్కడ.

నరేంద్రుడు

ఇక్కడ కష్టాలా ?

తిలోత్తమ

అన్నీ, సుఖం, కష్టం, — అంతా కృషి, అంతా విధి.

నరేంద్రుడు

కొంచం కొంచం అర్థం ఔతున్నది — నేను ఏఁవిచేయాలో ఇదిగో నాకే తెలుస్తది.

నరేంద్రుడు

ఔను, ఔను — అదుగో భూలోకములో నేను ప్రేమించిన ఆ స్త్రీ మనం వచ్చిన లోకానికి వచ్చినట్లు తెలుస్తున్నది. వెళ్ళి వస్తా — నీవురావా ?

తిలోత్తమ

నాకు చాలా పని ఉన్నది — నీవు వెళ్ళి రాగలవా ?

నరేంద్రుడు

ప్రయత్నిస్తా —

తిలోత్తమ

ప్రయత్నించు — విఫలం ఐతే నేను వస్తా, వీలు చూచి — సుఖం — కష్టం.

(మహా వేగమున రంగము మారిపోవును — పంచమాంకమున నున్న రంగస్థలము ప్రవేశించును.) (నరేంద్రుడు మాత్ర ముండును.)

నరేంద్రుడు

ఎన్నాళ్ళకు దర్శనం ప్రాణదేవతా.

(ఒక వ్యక్తి ప్రవేశించి, నరేంద్రుని సమీపించును.)

నరేంద్రుడు

చకుముకీ నీవు వచ్చేవే.

చకుముకి

ఓరీ నాయనా, ఇక్కడన్నీ దయ్యాలు (పారిపోవ యత్నించును.)

నరేంద్రుడు

చకుముకీ, భయపడకు, నీవుకూడా మావంటివాడవే —

చకుముకి

నేను దయ్యాన్నా ? అబ్బబ్బా !. నే అంటే నాకే భయం.

నరేంద్రుడు

చకుముకీ ! నీవు భూలోకం విడిచిపెట్టేవు — నీశరీరం, బూడిదై పోయింది.

చకుముకి

(తన శరీరమును స్పృశింపబోయి) రామ రామ, నిజమే — చచ్చిపోయాను, — చచ్చిపోయాను — అయ్యయ్యో ! (ఏడ్చును)

నరేంద్రుడు

దివ్యమైన లోకంవచ్చి చకుముకీ —

చకుముకి

వల్లకాదులోకం — నాకు ఆ భూలోకం వేఁ కావాలి నాయనా, ఓ నరేంద్రా, ఓ దేవతా, ఓ దయ్యమా రక్షించు నన్ను పోనియ్యా !

నరేంద్రుడు

పోవాలని ఉన్నా పోలేవు, ప్రార్థనచేసుకో, శాంతించు.

చకుముకి

అయ్యయ్యో ! రామ, రామ, రామ (ఒకవ్యక్తి ప్రవేశించును.)

నరేంద్రుడు

నా ప్రాణదేవతా స్వాగతం !

ఆ వ్యక్తి

నరేంద్రా, ప్రేమదేవతా, వచ్చేవా ! (వారిరువురు సమీపింపబోవ కాలము, అవకాశము, వారికి గాలిరూపమున అడ్డువచ్చును. వారు సమీపింప ఎంతయో ప్రయత్నింతురు)

నరేంద్రుడు

ఏమిదీ !

ఆ వ్యక్తి

అయ్యో !

(మఱియొక వ్యక్తి ప్రవేశించును)

మఱియొక వ్యక్తి

ఈమెది ఒకలోకం, నీది మఱిఒకటి, మీా ఇద్దఱి యత్న సాఫల్యముచే విధి మిమ్మల్ని ఒకచో కూర్పవచ్చును.

నరేంద్రుడు

ఇంకా యత్నమా !

మఱియొక వ్యక్తి

యత్నం, యత్నం, విధి — అశక్యముకాదు —

మొదటి వ్యక్తి

నరేంద్రా, ఇంకనూ బాధా !

నరేంద్రుడు

ఔను బాధ — ఐనా, యత్నం — యత్నసిద్ధిలో ఆనందం — ధైర్యం — భగవంతునియందు నమ్మకం —

మఱియొకవ్యక్తి

రా వెళ్ళాలి ఇంక, నే జాగ్రత్తగా దారిచూపిస్తా.

మొదటి వ్యక్తి

ప్రాణాధిదేవతా ! వెళ్తున్నా — మళ్ళీకలవు — ఎన్నాళ్ళో — ఈ వియోగం —

నరేంద్రుడు

ఇక్కడ క్రొత్త కాలం, క్రొత్తవియోగం, క్రొత్త బాధ — క్రొత్తయత్నం —

మొదటి వ్యక్తి

కాలవాహినిలో కొట్టుకొని పోతున్నాం — ఆనాటి శబ్ధానికిమాత్రం భంగంలేదు.

నరేంద్రుడు

సత్యం — ఎప్పటికైనా —

మఱియొక వ్యక్తి

వాగనుశాసనా ! నీ లోకానికి వెళ్ళే త్రోవలో నిన్ను అప్పగిస్తా —

వాగనుశాసనుడు

రామ, రామ, ఏంచేస్తారో, అధ్వానం, అధ్వానం —

మఱియొక వ్యక్తి

(నడచుచు) ప్రార్థన, — ప్రార్థన —

(తె ర ప డు ను)